# రెండు రెళ్లు

(మూడు ఆటలు)

భమిడిపాటి కామేశ్వరరావు

నామాటే నెగ్గింది, ఎవళ్లగొడవ వాళ్లది, రెండురెళ్లు నాలుగు

పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

## హెచ్చరిక

# నా మాటే నెగ్గింది

(ఒక ఆట)

[మోలియర్ రచనల్లో ఒకదానికి ఇది అనుసరణం. 27–1–1945 తేదీని రాజమండ్రి ఆర్ట్సు కాలేజిలో శ్రీ తెన్నేటి సూర్యనారాయణగారి అధ్యక్షత క్రింద జరిగిన పూర్వ విద్యార్థి వార్షికోత్సవ సమావేశ సందర్భంలో, అనుమతితో, ఇది మొదటిసారి ప్రదర్శించారు.]

పాత్రలు

శతకోపం—సలిలానికి నచ్చని పెళ్ళికొడుకు
అభిషేకం—సలిలం తండ్రి, గృహస్థు
నవనీతం—సలిలానికి నచ్చినవాడు.
మాలోకం, తలుపులు —మాయలు తెలిసిన నౌకర్లు
డాక్టరు సంతానం, డాక్టర్ సముద్రం —నాటు వైద్యులు
సలిలం—అభిషేకం కూతురు,

పాత్రధారులు

శతకోపం— శ్రీ దుగ్గిరాల సత్యనారాయణరావు
అభిషేకం— ,, యం. వెంకటరావు.
నవనీతం— ,, టి. జగన్నాథరావు.
మాలోకం— ,, పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు
తలుపులు— ,, సి హెచ్. సుబ్బారావు
డా॥సంతానం— ,, బి.వి. సూర్యనారాయణమూర్తి
డా॥సముద్రం— ,, కె. రామకృష్ణరావు
సలిలం— ,, ఎ. వి. రమణారావు.

గుమ్మంలో నుంచుని, వీధంట ముసిలిఘటాలు ఎవరేనా వస్తూంటే చెప్పు.

త—చిత్తం (అని, కుడి ఎవంకి పోతాడు)

న—సరిలం! మీనాన్న నీనిమిత్తం ఏర్పాటు చేసిన పెళ్లికొడుకు ఈ ఊళ్ళో దిగేరి ఈవేళే - ఇప్పుడే. ఇంక రిహార్స లేమిటీ, మనం గజ్జెకట్టి అసలు ఆటే ఆడేసెయ్యాలి.

స—ఆడచ్చుగాని, మనం నెగ్గుతామా ?

న—ఓ. చెప్పిమరీ నెగ్గుతాం. పెళ్లాశతో వస్తూన్న ఆ జంతువుని ఈ ఊర్నించి తరిమేసేస్తాం.

స—ఏమో! అంతపని జరిగేంతరవాత అనుకోవాలి

న—జరిగితీరుతుందిగాని, మీనాన్నకి ఆ సంబంధం అంటే అంత ముక్కువ ఎల్లాకలిగిందో!

స—ఏమో!

న—వాడికి నాకంటె రాబడి ఎక్కువనా ?

స—అయితేమాత్రం ?

న—అతణ్ణి మీనాన్న చూశాడా, అసలూ?

స—లేదుట, విన్నాట్ట!

న—మీనాన్న ఊహ వాడికి శాస్త్రం తెలుసుననా?

స—అబ్బో! అతని సంగతి చాలావరకు కనుక్కున్నారే అప్పుడేనూ!

న—కనుక్కోనుమరీ! అతని పేరే పడగొడుతుంది ఎంతిమందిని నైనా-'శఠకోపం'

స—(నవ్వుతూ) మరేమిటే 'శఠకోపం'!

న—ఇంటిపేరు- "కిటికోటి"-విన్నావా! వాళ్ళది పిల్లినీను. నిన్ను శఠకోప-సతి గా చేసెయ్యాలని మానాన్న సంకల్పం.

స—ఏమో గీటు ఎల్లా ఉందో! మీరు ఏవో మాయలు పన్నుతాం అన్నారుగదా అనే ధైర్యంతో ఉన్నాను.

న—పన్నుదాం అనడమేకాదు, పన్నేశాం, మావ్యూహాలు చివరదాకా సిద్ధంగా ఉన్నాయి. ఆరంభించడమే తడువు

స—ఏమిటవి?

న—అవేమిటని నువ్వు నన్ను అడగాకూడదు, నేను చెప్పాకూడదు. చూస్తూండూ తమాషా! జరగబోయే అద్భుతాల గురించి ముందే మనకి తెలిసిపోతే, మనకి కలిగే ఆనందం పల్చబడి పోతుంది. మనకి మాలోకం ఉన్నాడు, తలుపులున్నాడు. మాలోకం మాంచి ఇంద్రజాలి, తలుపులుకూడా మాంచి వేషధారి.

త—(కుడి ఎదర్నించి వస్తూ నవనీతంతో) మరండీ, వీరి నాన్నగారూ...

స—(దాక్కోడానికి యత్నిస్తూ ఎడమకేసి నడుస్తూ) నేనెక్కడ దాక్కోనూ?

త—మరండీ, వీరినాన్న గారండీ, రావటం... లేదండీ.

న—చూశావా, సలిలం, నువ్వెంత కంగారు పడిపోతున్నావో, వార్తి పుణ్యానికి!

స—మానాన్న వచ్చేస్తున్నారనుకున్నాను.

న—ఆయన రావడం యథార్థమే కావచ్చు. అయినా సరే, నువ్వేదో తప్పావేసేసి నిబ్బరంగా ఉంటూండాలి గాని, బయట పడిపోకూడదు.

స—ఏం తప్పావెయ్యనూ?

న—ఏదో ఓటకీ! మీనాన్న వస్తున్నాడా అనుకున్న చూడనట్లు నటించి, నాకేసే తిరిగి ఉండి, కన్నీళ్ళు పెట్టుకుంటూ, "నాన్న గారు ఇల్లావచ్చారండీ!" అంటూ నాటీనంగా అనుగుతూండడమో ఏదో చెయ్యాలి. అంతేగాని, పట్టుబడిపోకూడదు. అందుకే నీ, నీకు నా ఎత్తులూ గొడవలూ తెలియక పోడమే మంచిది, పోనిస్తూ!

త—మరండీ!...ఏరా నాన్న గారు కాదండి వస్తూంటూ, మాలోకం అండి.

మా—(కుడి ఎదిర్కొంచి వస్తాడు)

న—ఇదుగో, మాలోకం! రా, రా! ఏమిటయ్యాడు మన పిల్లిసీమ పెళ్ళికొడుకు? కనపడ్డాడా, మన శరకోపనాథుడు?

మా—ఆ. ఇక కాస్సేపట్లో ఈ ఊళ్ళోదిగుతాడు. పక్క మజిలీ ఊళ్ళో వాణ్ణి కలిశాను, చూశాను. భోజనంవేళ మనిషిని బాగా ఆరా తీశాను. వాడి రూపం ఉందండీ, ఆహాహా, ఏమిరూపం, ఏమిరూపం! నే చెప్పడం ఎందుకూ, కాస్సేపట్లో మీరే అనుభవిస్తురుగాని ఆ సహజ సౌష్ఠవం! ఇక వాడివేషం ఉందే, అది వాడిరూపానికి సమాన ఉజ్జీలో ఉండగాని తీసిపోయేట్టులేదు. ఈ రూపవేషాలకి తోడు వాడి బుద్ధి ఉందండీ బాబూ

— అంతమందబుద్ధిని మనం నెత్తికినా పట్టుగోలేం. మన బోను లోపడడానికి వాడు సరియైన జంతువు. మనం పన్నిన పన్నాగాల్లో వరసాగ్గా చిక్కడడానికి అర్హుడు ఎవడూ అంటే, వాడే నండి!

స—ఇంకేం, మనఎత్తులన్నీ వాడిమీాద చెల్లుతాయన్న మాటే!

మా—చెల్లితీరతాయండి. నేను మనుష్యుల్ని కాచి వడ బోశానండి, బాబూ!

స—సాధ్యేనా అది!

త—సాధ్యేనండయ్యా. ఈ మాలోకం ప్రజ్ఞ మామూలు రకం కాదండీ. ఇష్టుల్ని రక్షించడం గురించి సాహసకృత్యాలు చేసి ఇతను ఎన్నిసార్లు జైలులో పడ్డాడో మీారెరగరు. విజయం సాధించడానికి ఇతనే ఉండాలి. ఈ రకం అద్భుతాలు జరిపినవాళ్ళల్లో ఇతను యుగధీరుడు.

మా—ఆగాగు. నీ స్తోత్రాలు వినేసరికి నాకు సిగ్గవుతోంది. నీమాట చెప్పవేం? నువ్వు మట్టుకు సామాన్యుడివా? మారు వేషాల్తో వెళ్ళి ఎంతమంది ఎరగని వాళ్ళకి ఉ[illegible]చావు? ఎంతమంది అన్యాయికుల సొమ్ములు లాగేశావు?

త—ఆ, నీ దగ్గిర నేనెంతా?

స—అందుకనే, మాకు మీాయిద్దరి సాయమూ ఉండిగనుక, విజయం సాధ్యం.

మా—సరేనండి. కాని, అయ్యా, ఇకమనవాడు వచ్చే

స్తాను. మొదట, నేను వెళ్ళి అతణ్ణి కలుస్తాను. తరవాత జరప వలిసిన నాటకం మళ్ళీ ఒకసారి, సూక్ష్మంగా, మననం చేసు కుందాం పట్టండి. (1)—నేను అతణ్ణి కలవడం.

న—(2)—నేనతణ్ణి కలవడం. (3)—డాక్టరు పిర్యాదు.

మా—ఈవ్యూహం సంగతి డాక్టరుకి తెలియకూడదు, కావండీ!

న— తెలియకూడదు. తరవాత ...

మా—డాక్టరుగార్ని అభిషేకం గారింటికి పంపడం. అక్కడికే ఈజమూల్ ఖాన్ వెడతాడు (అనితలుపుల్ని చూపెడతాడు)

న—నాకేమీ బోధపడటంలేదు.

న—ఈక్షోభంతా నీకు అనవసరంఅని చెప్పానుగా సలిలం! నువ్వాల్టా అభినయించవలిసింది ఏమిటంటే ..ఏమిటిచెప్పు.

న—మానాన్న ఏదిచెబితే అది చాలా బాగుంది అనడం, ఆయన సంకల్ప ప్రకారం నేను నడుచుకోడానికి నాకు చాలా ఇష్టంగా ఉన్నట్లునేను కనపడడం, శతకోపాస్క తప్పుమనోకర్ని పెళ్లాడనని బిగిసి కూచోడం.

మా—అంతేనండి మీావంతు. తరువాత (5)-ఇద్దరు ఆడ వాళ్ళుంటాలి, అయిదారుగు పిల్లలు...

న—అవునవును. ఆ ఆడవాళ్లకి చెరో రూపాయీ ఇయ్యి. పిల్లలకి ఏదేనా కొనిపెట్టు. ఇదుగో (అని డబ్బుఇస్తాడు) వాళ్ళు ఏమేమి అనాలో కాగితాలమీాద రాశాను. (వెతిగితీసి కాగితాలు ఇస్తూ) ఇది ఒక ఆడదానిపార్టు, ఇది రెండోదానిపార్టు.

ఇది కుర్రాళ్ళు కేకలెయ్యవలసిన ఏర్పాటులున్నది.

మా—సరే మరి (6)- శరకోపానికి ఆడవేషం, ఈ పోలీసు ఉద్యోగి (అని తలుపుల్ని చూపెడతాడు)

త—మళ్ళీ నేను కాకుండా మరోరయితే బాగుంటుందేమో!

మా—ఆఁ నువ్వు కాకపోతే, మనఎత్తులు ఇంకా ఎంతమందికి చెప్పడం! చివరకి మీరే వీర్ని (సలిలాన్ని చూపిస్తూ) పారిపోతూంటే పట్టుకున్నట్టు...

స—ఆప్పుడు...సరే కాని, మొట్టమొదట అతను ఊళ్లో దిగగానే, అతణ్ణి ఏడిపించడానికి సరిపడినంత మంది ఉండాలిగదా?

మా—నేను ఇప్పుడు ఆ ఏర్పాటు చేసే వచ్చాను. ఓ యిరవైమంది దిక్కుమాలిన రాలుగాయి జనానికి నేను బాగా కాఫీ పోయించి, వాళ్లని బళ్లస్టాండు దగ్గిర పెట్టివచ్చాను. బండిలో వచ్చి అచ్చంగా జంతువులాంటి ఫాషనుకాడు దిగుతాడు, వాణ్ణి బాగా ఏడిపించండని వాళ్లతో చెప్పాను.

స—సరే, మనం ఇక పోదాం. సలిలం జాగర్త. నువ్వింక వెళ్లు. నిన్నుమేం వెంటనే కలుసుకోడానికి వీలుపడలేదు. నీ పాఠం నీకు జ్ఞాపకం ఉందా!

స—ఆ! నా పాఠం కాస్తేగా?

న—కథానాయికురాలు అల్లా అనడం ధర్మమా!

మా—(కుడిమధ్యకి జరిగి వినడం నటించి) అదుగో! శరకోపం ఊళ్ళోదిగాడు. వాణ్ణి నేపెట్టిన జనం గోలచెయ్యడం మొద

నా వరస! పిరాకు ఏమిటి కావాలి? ఇరాయి వాళ్లని ఇంతగా ఏడి పించడం ధర్మమేనా?

శ—(మాలో గాన్ని ఆప్యాయంగా చూస్తూ)అమ్మ! బుద్ధిగ లవాడు ఒకడు కనిపించాడు ఇప్పటికి!

మా—(వాళ్లికే నేతిరిగిఉండి) మర్యాదా అక్కర్లే? నవ్వడానికి కారణం అయినా ఉండాలా?

శ—ముకే! అల్లాగ ఇక్కట్లు కుంకలకి.

మా—(వాళ్లలో లాగ) మనుషానుభావుడి స్థితిగతుల్లో అంతగా నవ్వతగ్గ పిరాయం ఏమున్నా ఉందా?

శ—(కోపంగా వాళ్లవేపు ఒకఅంగ వేస్తూ)అని అడుగుతా!

మా—(వాళ్లలో లాగ) ఈయన కిడం వాళ్ళకి మస్తే లేదా?

శ—నాకేమున్నా అపిటా, గూనా?

మా—(వాళ్ళతో లాగ) ఎదటిమనిషి ఎవరో కాస్తగమనించి మరీ ఇదవండి.

శ—నూ బాగా అన్నావు.

మా—(వాళ్ళతో లాగ) ఈయన గొప్పలక్షణాల్ని మన భుజాల మీదా ఈయన్ని మన నెత్తిమీదా ధరించాలి, మనం అంతా!

శ—అక్షరాలా నిజం.

మా—(వాళ్లతో లాగ) ఈయన తరహా గొప్పడు.

శ.—అందులోనూ నేను పిల్లిసేమప్రాంతం పురుషుణ్ణి.

మా—(వాళ్లతో లాగ) వీరు ఎంతో సూక్ష్మబుద్ధి

శ—నిస్సంశయంగా, న్యాయశాస్త్రంలో ఘట్టుపండితుణ్ణి.

మా—(వాళ్లతోలాగ) ఇల్లాంటివాడు ఈవూరిని రావడను నేడే గౌరవం ఈవూరికి.

శ—మునుపాటికీ నిజం.

మా—(వాళ్లతోలాగ) ఈసుమాజనుడిదగ్గిర సంస్కృతాస్పదమైన సంపర్కం కించిత్తూ లేదు.

శ—మందులోకైనా లేదు.

మా—(వాళ్లతోలాగ) అంటున్నాను, (కొంచెంకోపంగా) మీలో మొదట సర్వేషామూతిమెవడికి చెబుతుందో ఆనూతి గలవాడికి సవ్వారీ కట్టించేస్తాను. ఈపాటి నోరుమూసుకుండండి.

శ—(మాలోకంతో) అయ్యా! మీకు నేను చాలాఋణపడ్డాను.

మా—అయ్యా! మీఅంతవారికి ఇటువంటి ఆకతాయి సహ్వాగతం అయిపోయిందే అని దుఃఖిస్తున్నాను.

శ—దానికేంలెండి, నేను తమ సేవకుణ్ణి.

మా—తమరు కొందరితో కలిసి ఉదయాన్ని చద్ది ఆరగించడం నేను ఈవేళ గమనించాను. ఆచద్ది భుజించడంలో మీరుగారు కనపరచిన విలాసం ఉందే, దాంతో మీమీద నాకు ఎక్కడలేని స్నేహమూ పుట్టుకొచ్చింది. ఈవూరు మీకుకొత్తగనక మిమ్మల్ని కలుసుగుని నే చెయ్యగలసేవ తమకి చేస్తానని మనవి చేసుగోవాలనే సంభ్రమంతో వచ్చిపడ్డాను. కొత్తవాళ్లని ఆదరించడం ఎరగనే ఎరగరండి ఈఊరుజనం!

శ—మీకు నిజంగా చాలాదయ.

మా—ఇందాకానే అన్నానుగదండీ!... మిమ్మల్ని చూసి న తక్షణం నామనస్సు మీవైపు వాలిగింది.

శ—భాగ్యం. మీకు ఎంతో విధేయుణ్ణి.

మా—మీముఖవైఖరి నన్ను సంతోషపరిచింది.

శ—(ఆనందిస్తూ) నన్ను మీరు ఎంతో గౌరవిస్తున్నారు.

మా—మీముఖంలో రాజద్యుతి అనేది ప్రతిఫలిస్తోంది.

శ—ఏమిటో! తమకు నా ఖర్మ (అని సిగ్గు నటిస్తాడు)

మా—మీముఖం ప్రేమపూర్ణమై..........

శ—ఆఁ....

మా—విలాసంగా

శ—అల్లానే సరీ!

మా—మధురంగా

శ—అవును!

మా—రాజఠీవితో

శ—ఓహో!

మా—అమాయికంగా

శ—అక్షరాలా!

మా—ఆకర్షణీయంగా

శ—అద్దమా!

మా—ఉంది.

శ—ఉంది. సందేహమా!

మా—నేను మీవాణ్ణి.

శ—నేను మీ విధేయుణ్ణి.

మా—నేను నా హృదయ గర్భాన్నించి చెబుతున్నాను.

శ—నేను నమ్మకమానను.

మా—మీ పరిచయంనాకు కలిగితే, నా త్రికరణశుద్ధి మీకే తెలుస్తుంది.

శ—ఆ సంశయమే లేదు నాకు.

మా—నమ్మించి దగాచెయ్యడం మా ఇంటావంటా లేదు.

శ—అసి, నానమ్మకం!

మా—ఉద్దేశాలు దాచేసుకోడం నాకు చేతకాదు.

శ—నా ఉద్దేశం అచ్చంగా ఉంటే.

మా—నా వేషం బట్టి నామనశ్శుద్ధి పోల్చుకోవచ్చు, మీరు.

శ—అందుకనే, నేను ఏకంగా సభావేషం వేసేశాను.

మా—మంచిపని చేశారు. ఈ వేషం మీకు తగ్గట్టు మరోడికి తగదు.

శ—శాస్త్రులు కట్టినవాడూ అల్లానే అన్నాడనుకుండి. ఇది మంచి ఖరీదుగలవేషం. దీంతో జనం దంగై పోతారు.

మా—జనం పట్టికొట్టేస్తారు. మీరు బస చూసుకున్నారా?

శ—చూడాలి.

మా—ఈపక్కనే ఒక వసతి ఉంది. ఖాళీలున్నాయేమో కనుక్కొస్తా నుండండి. (అని ఎడమ ఎదరకి వెళ్ళబోయి మళ్ళీ ఆగుతాడు.)

(కుడి మధ్యనించి నవనీతం వస్తాడు)

న—(వస్తూ, చాలా పరిచితుడులాగ) ఓహోహో! ఇదిగో! ఏమిటేమిటీ! ఎప్పుడూ రావడాలూ! ఎన్నాళ్ళకి శరకోపంగారి దర్శనం అయింది! చాలా సంతోషం! అదేమిటండోయ్, నన్ను మరిచే పోయినట్టు అల్లా చూస్తున్నారేం?

శ—చిత్రం చిత్రం

న—అయిదారేళ్ళలోనే కుటుంబస్నేహితుణ్ణే మరిచిపోయారే, ఆశ్చర్యం!

శ—అవునవును. (స్వగతం) వీణ్ణి నే నెరుగుంటే నన్ను చంపుగున్నంత ఒట్టు!

న—మీ కిటికోటి కుటుంబంలో చంటిపిల్లల లగాయతు చచ్చిపోయిన ముసలమ్మలదాకా నేను ఎరుగుదును. వెనక నేను మీ ప్రాంతు ముకాంలో ఉన్నప్పుడు రోజూ మిమ్మల్ని దర్శించేవాణ్ణి.

శ—నా మీద గౌరవం మీకు అల్లా ఉంది.

న—సరే. మీకు నా ముఖమే జ్ఞాపకం లేదూ?

శ—(ముఖంకేసి నిదానించి) మరే మరే. (స్వగతం) వీణ్ణి ఎంతమాత్రం చూళ్ళేదు.

న—అబ్బ! మనం ఎన్నిసార్లు కలిసి తాగామండీ అవీ ఇవీనూ!

శ—నిజమే, తాగేవాళ్ళం. (స్వగతం) నాకు ఆ సంగతి ఏమీ తెలియదు.

న—అయితే చూడండీ. ఆ పాటలపాడుతుండేవాడే, వాడి పేరేమిటి చెప్మా...(అని, జ్ఞాపకం చేసుకుంటూన్నట్టు నటిస్తూ)...నాలికచివర ఆడుతోందండి...స్వర్గతుల్యంగా పాడేవాడండీ!

శ—మల్లాయి.

న—హాదుగో, వాడూ! మల్లాయి. మరే మరే మల్లాయే. వాడు సరే, అక్కణ్ణించి రోజూ జనం షికారు వెడుతూండే చోటుంది, మంచిదీ...

శ—నల్లప్ప సమాధి.

న—మరేమరే నల్లప్ప సమాధి! అక్కడ హాయిగా మనం ఎన్నేసి గంటలపాటు ఎలాంటి సంభాషణలు జరిపాం! జ్ఞాపకం లేట్టండీ!

శ—(చిరునవ్వుతో) అక్కడా, అవునండోయ్, (మాలోకంతో) అల్లాంటిదేదీ నాకు ఛస్తే జ్ఞాపకం రావటంలేదు.

మా—(శరకోపంతో రహస్యంగా) బాగా జ్ఞాపకం చేసుకోండి పోనీ, తీరా ఇతను గొప్పవాడేమో!

న—(శరకోపంతో కరకంపనం చెయ్యబోతూ) అసలు పూర్వస్నేహంలాంటి వస్తువు ఉండటండీ!

మా—(శరకోపంతో రహస్యంగా) మీరంటే ఆయనకి బహు ఆప్యాయంగా ఉందే?

న—(కరకంపనంచేసి) మీ వాడోకాయన గొప్ప...

శ—మరే, మా అన్న. మేస్త్రీటు.

న—అప్పుడప్పుడు. ఆయనే, క్షేమమేనా ?

శ—ఏదో మీ దయ. యథాశక్తిగా క్షేమంగా ఉన్నాను

న—చాలా సంతోషం. శరవాణ...మీ బంధువుడే ఒక మహాసాత్త్వికుడుండాలే ! మీ...మీ...

శ—అవునా, మా పింతాత సునమకు—పరల కంట్రోల్ అధికారి.

న—(దీర్ఘంగా) ఆం...ఆయన ?

శ—వాడికేం ? వాడికంతా దబ్బే. బహు క్షేమంగా ఉన్నాడు.

న—చాలా ఆనందం. మీ మామ కుశలమా ?

శ—నాకు మామ మొదణ్ణించీ లేడు.

న—అహా. వేరెక ఉండాలి కాట్టండీ ?

శ—అబ్బే, ఒక మేనత్త.

న—అల్లా చెప్పండి మరి ! ఆవిడే శ్రీమతి...ఆవి ఇల్లా ఉంది ?

శ—ఆర్నెల్లయింది.

న—పాపం, నే విన్లేదనుకోండి. అయితేం, ధన్యురాల్లెండి. మహా దొడ్డఇల్లాలు. ఆవిడికి పిల్లలున్నట్టు జ్ఞాపకం !

శ—ఒకడున్నాడు. వాడు మఠాధికారి. కాని, ఈ మధ్య మా మేనల్లుడికి మసీసగం పోసి మరణాం అంతపని జరిగింది.

న—అంతపని జరిగింది కాదు, మీకు మహాచిక్కు-
వేది!

శ—మీరు వాణ్ణి ఎరుగుదురా ఏమిటి?

న—అయ్యో! చాలా దోస్తీగా ఎరుగుదునండి—
అందంగా పొడుగ్గా ఉంటాడూ!

శ—అంత మరీ పొడగరి కాడు.

న—కాకపోతే లెక్కేమిటి లెండి, మహా అందకాడు.

శ—మరే.

న—అతడు మీకు స్వయానా మేనల్లుడై ఉండాలి.

శ—మరే.

న—మీ సోదరికి పుత్రుడు.

శ—మరే.

న—అతడు వెనక నిక్షేపంలా ఉంటోచ్చినట్టు జ్ఞాపకం!

శ—మరే, (మాలోకంతో) ఈయన నా బంధువు
లందర్నీ ఎరుగునయ్యా!

మా—మీరు అనుకున్నకంటే కూడా ఎక్కువగా ఎరుగు
న్నట్టున్నాడు.

శ—(నవనీతంతో) తమరు మా వూళ్ళో మకాం దీర్ఘం
గానే వేసుంటారు.

న—రెండు నిండు సంవత్సరాలపాటు వేశాను.

శ—అబ్బో, అల్లానా! అయితే మా పింతాతగారి
మనమడి కొడుకు భారసాల ఎరుగుదురన్నమాటే!

స—ఔన్నన్నా. మొదటి ఆహ్వానం నాకే పంపించారు.

శ—ఆ బారసాల మహా ఒకటోరకంగా జరగలేదూ ?

స—చాలా.

శ—భోజనాల ఏర్పాటు బహు [illegible]గా ఉంది.

స—అద్భుతంగా ఉంది.

శ—అయితే మీకా నాకా దెబ్బలాట జ్ఞాపకం ఉందన్న. మాటే—నాకూ వాడికీ... ఆసనవచ్చ్యా ఎవడో వచ్చాడే కీత లూసువాడు— వాడికీ నాకూ జరిగిన దెబ్బలాట.

స—ఆ ఆ స్పష్టంగా కళ్లకి కట్టినట్టు ఉంది.

శ—వాడికి తగ్గ ఉజ్జీగా నిల్చానా లేదా నేను ?

స—వాడు మీకు బలాదూరై పోయాడు.

శ—కాని, మీకు జ్ఞాపకం ఉందో లేదో, (ఉడుకుమోతుతనం నటిస్తూ) ఆఖరికి నన్ను చాటంత చెంపకాయ కొట్టాడు స్మండి (గల్లీ ఉత్సాహంగా) నేనూ వెంటనే వాడికి ముట్ట చెప్పేశానండి అట్టేపెట్టుకుండా!

స—అవునవును. అప్పట్లో మేం అడ్డుకోకపోతే వాణ్ణి చంపేసి పాగు లెట్టేసేవారే! కాని ప్రస్తుతం ఒక్కమనవి. నాయింట్లోతప్ప మీరు మరోచోట బసచేస్తే నేను ఎంతమాత్రం ఒప్పను.

శ—నేనూ......

స—నేనూ లేదు నానూ లేదు. పరమస్నేహితుల్లో ఒకరెల్లి పరాయిచోటబస చేస్తూంటే చూస్తూ ఊరుకోడ మెల్లాగండీ!

శ— ఒకవేళమీకు కొంచెం ఇబ్బంది......

న—ఈవిక్కుమాలి ఇబ్బందులు ఎప్పుడూ ఉన్నవే పోనివ్వండి! నాయింటే తమరి బస. రెండోమాట నోటంట రానీకండి.

మా—(శరకోపంతోరహస్యంగా) అతడంత పట్టుబట్టేటప్పుడు పోనీ మా భాగే అనండి.

శ—పోనీమీతో వస్తాం అంటే నా సామాను...

న—మీ సామాను ఎదీ?

శ—బళ్లు దిగేచోటవుంది. నౌఖర్ని అక్కడ పెట్టి సామాను చూస్తాండమన్నాను.

న—ఎవర్నైనా పంపి తెప్పించండి.

శ—ఎల్లా? మోసగాళ్లుంటారు, అక్కణ్ణుంచి నేనొచ్చేవరకూ కదలద్దని వాడితో చెప్పొచ్చాను.

మా—మంచి బాగా కట్టుదిట్టం చేశారన్నమాట.

శ—ఈవూళ్లో వీలైనంత జాగర్తమీద ఉండటమే నయమని నాకు ముందే తెలుసు (నవనీతంతో) మీరుకూడా నాతో రండి, వెళ్లి సామాను తీసుగుని మీయింటికి పోదాం.

న—అవశ్యం వస్తా. కాదండీ నేను ముందెళ్లి మీనిమిత్తం కొన్ని సదుపాయాలు చేయించాలని చూస్తున్నాను.

శ—అయితే మీబస ఎక్కడో చెప్పి పొండి, వీరూ నేనూ వెళ్లి సామాను పట్టించుగొస్తాం.

న—(మాలోకంతో)-(కడిమధ్యకేసిచూస్తూ) అదుగో, ఆ కనబడే పెద్దభవనానికి వీరినీ సామాన్ని తీసుకురండి. అదినా ఆంతర్యస్నేహితుడిఇల్లు. అక్కడ సేద తీర్చుకుని క్రమేపీ మా

యింటికి పోదాం. (అని కుడిమధ్యకి పోతాడు)

శ——(కులుకుతూ మాలోకంతో) చూశారా! చోటు పరాయిచోటు అయినా యోగం ఉండబట్టి మీలాంటి నిష్కారణ పరిచయుడూ ఆయనలాంటి పూర్వస్నేహితుడూ నిమిషంలో నాకు దొరికారు.

మా——నిజమేనండి. మీది చాలా గొప్ప యోగం. లేకపోతే వివాహం కలిసిరాదు. మీకు శ్రమ ఎందుకు, నేవెళ్ళి తెస్తునా మీకా సామానూ?

శ——మానౌఖరు అది త్రినేత్రుడికైనా ఇవ్వడు. అది వాణ్ణెత్తినే పెట్టి వాణ్ణి మీ వెంటరమ్మనండి.

మా——(కుడిమధ్యచూపిస్తూ) నడవండి. మిమ్మల్ని ఆభవనం దగ్గిర జేర్చి నేను బళ్ళ దగ్గిరికి వెడతాను.

(అని కుడిమధ్యకి నడుస్తాడు. అతని వెనకాల దర్జాగా శఠకోపం వెడతాడు. తెర)

## 3 వ రంగం

(కుడిప్రక్క కొన్ని సీట్లు ఉంటాయి. ఎడమ మధ్య నించి ముందు నవనీతమూ, వెనకాలే శఠకోపమూ వస్తారు)

న——(ఖాళీసీట్ల కేసిచూసి) సరి. మా స్నేహితుడు లేనట్టు న్నాడు. మాయింటికే పోదాం రండి ఏకంగానూ! (అని తిరిగి వెనక్కి వెళ్ళబోతూ) పోనీ, ఓపని చెయ్యండి. మీరు ఒక్క

క్షణం పాటు బయటికి వెళ్ళి నిలబడండి. నేను లోపలికెళ్ళి వాకబు చేసివస్తాను.

శ—త రగా రండి (అని ఎకము గుమ్మంకి నిష్క్రమిస్తాడు)

న—(కుడి మధ్యకి నడిచి) ఏమండోయ్, డాక్టర్ గారూ, డాక్టర్ గారూ !

(డాక్టర్ సంతానం కుడినుధ్యనించి వస్తాడు)

—నమస్కారం, డాక్టర్ సంతానంగారు !

సం—నమస్కారం. దయచెయ్యండి.

(ఇద్దరూ కూచుంటారు)

న—నిన్న తమతో మాట్లాడానండీ.

సం—అవునవును. మీకు బిల్లు పంపించలే ?

న—నేనేమీ మందు పుచ్చుగో లేదండి.

సం—అల్లానా !... మీ పేరు ?

న—నా పేరు నవనీతం.

సం—ఓహో !

న—ఈమధ్య తమకి కబురుపంపించానండి.

సం—ఒస్ అదా! ఎవరో మీబంధువుడికి మతిపోయిందనేనా!

న—మరేనండి. అతణ్ణి మీయింటోనే ఉండనియ్యాలి.

సం—అల్లానే. తరుచుగా చూస్తూండచ్చు.

న—పైగా, ఇతరుల్నించి బాధ ఉండదు.

సం—అల్లాగే. తీసుగుతండి. బిల్లు జోరుగా అవుతుంది. చాయుశక్తులా తంటాలు పడతాను.

న—తీసుకొచ్చానండి. ఇక్కడే ఉన్నాడు.

సం—మరీమంచిది. ఇప్పుడు మాయింట్లో ఒక గొప్ప వృద్ధవైద్యుడు మకాంగా ఉన్నారు. వారితో కూడా సంప్రతించి మరీ చేస్తాను, చికిత్స.

న—చిత్తం చిత్తం నేనింకా ఏర్పాట్లూ అవీ చూసుకోవాలండి, వాటిని మాత్రంలోపలికి పంపిస్తాను.

సం—అల్లాగే ఆయన చాలు పోనీ. మీరు వెళ్లండి. నేను డాక్టర్ సముద్రంగార్ని లోపల్నించి తీసుకొస్తాను.

(అని కుడిమధ్యకి వెడతాడు. నవనీతం ఎడమమధ్యకివచ్చి, శఠకోపాన్ని పిల్చి, ఒక సీటుమీద కూర్చోమని)

న—మీరిల్లాదయచెయ్యండి. మా స్నేహితుడు ఇంట్లోనే ఉన్నాడు. చెప్పాగా. వస్తున్నాడు. యథాశక్తి మీకు ఆతిథ్యం ఇస్తాడు. నేను మా ఇంటికి పరిగెట్టి మీగురించిన ఖంజాయి పులు చెయ్యాలి. వెళ్ళొచ్చి మిమ్మల్ని తీసుకెడతాను. ఇక్కడే ఉండండి.

(అని ఎడమ ఎదర్నించిపోతాడు. కుడిమధ్యనించి మొదట సంతానమూ అతనివెనకాల సముద్రమూ వచ్చి శఠకోపానికి చెరోపక్కా ఉండేటట్టు కుర్చీలు లాక్కుని కూచుంటారు.)

సం—(శఠకోపంకేసిచూస్తూ) మీకు ఉపచారం చెయ్యడం అనేది, నేను, ఒక గొప్పగౌరవంగా భావిస్తున్నాను.

శ—ఏః తమరెంతమాటా! తమసేవకుణ్ణి.

సం—(డాక్టర్ సముద్రాన్ని చూపించి) ఇరుగో అఖండుడు,

నా సోదరులు వీరి సలహా పుచ్చుకున్న మీదటే నేను మిమ్మ ల్ని సేవించడం.

శ—నన్ను సేవించడానికి ఇంత అట్టహాసం అక్కర లేదండి. నేను అల్పసంతోషిని.

సం—ఇల్లా చూడండి.

శ—చూడనా! ఎందుకూ?(అని చూస్తూ నిర్ఘాంతపోతాడు)

సం—అల్లా ఆయనకేసి తిరగండి

శ—(కోపంగా) ఎందుకూ?(అని సముద్రం కేసి తిరుగుతాడు)

సం—చాలు. ఇల్లా తిరగండి. మీకు తిండి బాగా తింటున్నారా?

శ—దక్కినంతవరకు తింటున్నాను అంతకంటె బాగా తాగుతున్నానుకూడానూ.

సం—అదే పొరపాటని. ద్రవపదార్థాలగురించిన తృష్ణ ఉంటే, అది, లోపల తిష్ఠ వేసి ఉడుకుతూన్న తాపం యొక్క సూచన. సరే, మీకు బాగా నిద్ర పడుతుందా?

శ—ఓ. భోజనం ఉదాత్తం అయినప్పుడు వొళ్ళు తెలియని నిద్ర పడుతూంటుంది.

సం—మీకు స్వప్నాలు ఒక్కరవ్వ జోరుగా వస్తూంటాయా?

శ—అడపా దడపా వస్తూనే ఉంటాయి. నా స్వప్నాల జోలి మీకెందుకూ?

సం—మీకు వచ్చే స్వప్నాల స్వభావం ఎటువంటిది?

శ—నాకొచ్చే స్వప్నాల స్వభావమా? ఓయి నీ సంభా

షణ తగదయ్యా? ఇదేం సంభాషణయ్యా ఇప్పుడూ?

సం——కొంచెం ఓపిక పట్టండి. మీ సంగతి మీ సమక్షంలోనే యోచిస్తాం. ఆ యోచన యావత్తూ మీకు బాగా అవగాహన అయ్యే నిమిత్తం, అంతా వ్యావహారిక భాషలోనే జరుపుతాం.

శ——యోచన ఎందుకయ్యా! కాస్త ఫలారం పెట్టడానికి లేకపోతే కాస్త దాహం ఇవ్వడానికీనూ? అంతలనాకు అర్జెంటు పనికూడా ఉంది.

సం——మొట్టమొదటిపని రోగాన్ని పసికట్టడం-అనగా రోగస్వభావ నిర్ణయం.

స——శాస్త్రంకూడా అల్లానే చెబుతోంది.

స——తరవాత దోషస్థాన నిర్ణయం, నిదాననిర్ణయం, చికిత్సా నిర్ణయం, పథ్యనిర్ణయం-ఈ క్రమం చొప్పున నిర్ణయించుకుంటూ పోవాలి.

శ——(ఇద్దరి కేసీ చాలా భయంతోనూ అనుమానంతోనూ చూస్తాడు)

సం——నా ఉద్దేశం ఈయన వ్యాధి చింత—కేవల మిథ్యా చింత. ఇది ఒకరకం మతి భ్రమణం (సముద్రంతో) తమబోట్లకి కూడా పని చెప్పేరకం. మతి భ్రమణమూలాలు ఏవేవిఅంటే మెదడు, లేక కర్జమూ, లేక అన్నకోశమూ! వీరి చింతా భయాశ్చర్యాలు నేచెప్పినదానికి తార్కాణం. కళ్ళూ వాలకమూ కూడా తత్సంబంధమైన సూచనలే, ఇది ముదిరి జీర్ణించి ఏక

ఉస్త్రానాన్మదంలోకి గాని, క్షయలోకిగాని, మూత్రపిండాలోకిగాని త్రేత రుక్మిణిపిప్పిలోకిగాని దింపుతుంది. దీనికి చెప్పదగినశస్త్రాలు రక్తోత్సర్జనమూ, భేదీస్వీకరణమూ, సార గ్రహణమూ, వినోదపదసంగీత శ్రవణమూనూ! అప్పటప్పట నృత్యంకూడా చేస్తూ ఉం టూంత్యంపోయి చలాకీ నొచ్చుతుంది.

శ—(కుప్పతేలేసి నోరువెళ్ళబెట్టి గుండె బాదుకుంటాడు)

సం—డాక్టర్ సముద్రంగారూ, తమ అభిప్రాయం ఏమిటి?

స—డాక్టర్ సంతానం మహాశయా! మీరుచెప్పిందిచాలా యథార్థం. మీరంటె ఎక్కువ దేవుడు చెప్పలేడు. నా సలహా! బుద్ధ్యాచింతగురించిమీరన్నదిసత్యం. ఇతనికిఆ వ్యాధిలోగ ఉన్నట్లో తే పోయినా పండితులైన మీరు దాన్ని వర్ణించడంలో ప్రద ర్శించిన ఊహాపోహాల బలంవల్ల ఇప్పుడైనా ఈయనకి ఆ వ్యాధి సంక్రమించాలన్నమాట ఈయన మీ చేతుల్లో పడడం అనే అదృష్టం పెట్టిపుట్టాడు గనక నే ఈయనకి పిచ్చెత్తింది ఈ మనకే గనక వెర్రెత్తిఉండకపోతే మీ వైద్యప్రభావం ప్రపంచానికి తెలియక పోయేదిగదా! తక్షణం బజానాగాబత్తు ఇంజెక్షన్ ఇప్పించండి. తరువాత క్షీరసారం ఇచ్చి స్నానం చేయించి నుదురుకి పట్టీ వెయ్యండి. ఆపట్టీలో ఉప్పుపడాలి. ఉప్పు జ్ఞాన చిహ్నం.

శ—ఓరి మీవాగుడు మండా! ఇందాకట్నించి చూస్తాను, ఏ బటరాత్రి యిదీ! ప్రహసనం ఆడుతున్నారా ఏమిటరా? మీ బిడ్డహూనూ!

స — ప్రహసనమా? మేం ఆడటంలేదు.

శ — ప్రహసనం కాకపోతే, ఏమిటిమరి ఇందాకట్నించీ మీరు కిచకిచలాడింది? ఇధవ కిచకిచలాటా మీరూనూ, కోతి పీనుగుల్లారా! పెళ్లికని నేనొస్తే వెర్రేమిటరా? వెర్రి మొహల్లారా!

సం — (తీవ్రంగా చూస్తూ) అయినో, హెచ్చుతగ్గుకూతలు. ఇది మంచి సూచనే. ఇది వెర్రిలోనే జను.

శ — ఆయిద్దరు పశువులూ ఏకమై నన్ను ఈయిద్దరి గాడిదల మధ్యా పడేసి పెళ్లారాఏమిటని చెప్మా! అయ్యో! ఏమిటిఖరి! (అని వాళ్ల మొహాలు చూసి, అసహ్యంగా) తుథూ (అంటూ ఉమ్మేస్తూ తిడతాడు)

స — చూశారా, చూశారా! ఇది మరో లక్షణం వెర్రికి— తెగఉమ్మడం.

శ — ఒరేయ్, మీరిద్దరూ ఏడిశారుగాని, చెరోవైపూనూ ఎవరి దార్ని వాడు పోదాం పట్టండి. నాకు వ్యవధిలేదు.

సం — ఇటూ అటూ పోవడం— ఇది మరో చిహ్నం వెర్రికి.

శ — ఓరి మీ మొహాలు అంటించా, నాకు పెళ్లని నేవస్తే, నాకు వెర్రని మీరేడుస్తున్నా రెందుకూ? నాతో ఏంపనిరా మీకూ?

సం — మాకు వచ్చిన విన్నపం ప్రకారం మేం మీ కేసు పట్టాం. మీరోగం కుదర్చాలి.

శ — ఆమాట మళ్లీ అను. నారోగం కుదరుస్తారా?

సం — నిశ్చయంగా.

శ——ఓసి మీకు నాశనమైపోనూ, నాకు జబ్బేం రోగం ఉండ్డానికీ?

స——మహాశయా! రోగి తనకి జబ్బని అనుకోడు. అతని రోగానికి అమోఘనిదర్శనం.

శ——నేను సుబ్భరంగా ఆరోగ్యంగా ఉన్నాను. నాయితు న్నాను వినండోయ్, ఇంకెల్లారా?

సం——మాకు తెలుసునయ్యా! నీశరీరతత్వం లోకి చూశాం. నీకులోపల వ్యాధి ఉంది. మేం వైద్యం చూస్తాం.

శ——మీకిద్దరికీ అదేం పెద్దరోగం తిన్నగా పోతారా! నాకు వైద్యంఅక్కర్లేదు. వైద్యానికీ నాకూ శత్రు. మందులకీ నాకూ చుక్కెదురు. నేపోతాను.

సం——మహాశయా, డాక్టర్ సముద్రం! ఇతడి వ్యాధి మన ఊహనిమీరిపోయింది.

శ——ఏమో! మాఅమ్మా మానాన్నా ఎన్నడూ మందులు పుచ్చుకోలేదు. వాళ్లు వైద్యసహాయం కించిత్తూ లేకుండానే చావగలిగారు.

సం——అందుకనే ఇటువంటి వెర్రిపుత్రుణ్ణి కన్నారు. (సముద్రంతో) అన్నా, రండి. మనవైద్యం ప్రారంభింతాం. చెలరేగిపోతూన్న ఇతని చిత్తవృత్తుల్ని అణిచి సాఫుచేసి, శాంతపరచి, సమబాలుంచి పారేద్దాం. (అని కుడిమధ్యకి పోతూ) రండి వీధతలుపు వేశాస్లెండి. ఇతను ఇక్కడే ఉంటాడు ——(అని వెళ్లిపోతాడు).

స—— (సంతానం వెనకాలే నడుస్తాడు)

శ—ఇదంతా చిత్రంగా ఉందే! ఈ ఊరుజనం ఏకమొత్తం — పత్రికీరుగులా ఏమిటి చెప్మా! ఇంత పిచ్చిధోరణి ఎక్కడా చూడలేదు. ఏమీ బోధపడటం లేదు. పెళ్లిసంగతి ఎత్తకుండా నేచస్తే,నా వెర్రి కుదుపుస్తారట వీళ్లు! వీళ్లకి బాగా పెళ్లి చేసేసి స్త్రీ వదల కొట్టేస్తాను. ముందు ఇక్కణ్ణుంచి పారిపోవాలి. (అని తలపట్టు కుని కుర్చీలో కూలబడుతూండగా, తెర)

## 4 వ రంగం

(రెండో తెర ఎదట— కుడి ఎదర్నుంచి సంతోషం ఖంగారు గా వస్తూంటే ఎడమ ఎదర్నుంచి మాలోకం వచ్చి కలుస్తాడు)

మా—(చిరునవ్వుతో)ఆయనకికొంచెం నయంగా ఉందాండీ?

సం—(విసుగ్గా) నయమా! ఒకటే నయం దిక్కు మాలాడికి!

మా—అదేమిటండోయ్, అల్లా అంటున్నారు!

సం—ఏం చెప్పనూ! నేను వాణ్ణి ఎంత కట్టుదిట్టం చేస్తేం. తెంపు కుని పారిపోయాడు చచ్చినాడు! నేనువాడికోసం ఏర్పాటు చే సిన మందులు బోలెడన్ని వ్యర్థం అయిపోయినాయి.

మా—ఇంతఘురానామందులు చెడనాడుకుని వాడుపారిపో డం అనేది తనని తనే ద్వేషించు గోడం అన్న మాట—ఒకవిధం గా ఆత్మహత్యఅన్నమాట!

సం—సందేహంఏమిటీ! అతడికి రోగనివారణ అంటేనే

కట్టటం లేదు. అంటే ఏమిటో తెలుసా? మతిస్థిరం లేకపోవడ మూ బుద్ధి నీచపడడమూ అన్నమాట.

మా—అప్పయ్యగారూ! పారిపోకుండా ఉంటే ఈపాటికి అతని రోగం సహజంపై చిలుకు కుదిరిపోయి ఉండును, దూషిగా.

సం—దూషిగా. వాడిశరీరంలో పదివన్నెండు వ్యాధులు కలిసి కుట్రచేస్తూన్నా సరే, అన్నిటినీకట్టకట్టి కుంపట్లో పెట్టి ఉంచేవాణ్ణి.

మా— మరోటి. మీచేతులో పడబోయే యీ బీదవాడు లూకుడా పోగొట్టేవాడే.

సం—ఆఁ ఎల్లా పోగొట్టేస్తాడు వెర్రిమనిషీ! అవి వదలుకుంటానా నేను! అని మీదగ్గిర వస్తూలు నేనుగుం, వాడు పన్నసిపట్టి నా సరే వాడికికుదిర్చి తీరతాను. వాడు నా యుంగవరం చేతిలో జరిగింది గనక, వాణ్ణిబలిమిని పట్టించి, వాడిమీద ఔషధనిరాకరణ నేరం మోపిస్తాను.

మా— అల్లాచెయ్యడం న్యాయమే అనుకుంటాను. మీ మందులు అల్లాంటివి మరీ! పైగా మీకు రోగుల సొమ్ము పోతోంది.

సం— ఎక్కడికీపోడని చెప్పానుగా! ఆఖరవాతేనగాని, ఇప్పుడు వాడునాకెక్కడ దొరుకుతాడా అని చూస్తున్నాను.

మా—నిస్సందేహంగా, ఒకానొక చోట ఉండవచ్చునంటి.

సం—ఎక్కడ...ఎక్కడ?

మా—అభిషేకంగారనిఉన్నాడే మహానుభావుడు! వారింటో!.

సం—వీడికి వారితో బాంధవ్యం ఉందా?

మా—కాబోతోందిట. అభిషేకం కూతుర్ని ఇతనికు పెళ్ళాడతాడట. కర్మదశ, ఈకాబోయే అల్లుడికున్నలోపం ఆ అభిషేకంగారికి తెలియదుగావును! తొందరపడి ఆయన తనపిల్లని ఇతని చేతులో పెట్టేస్తాడేమోకూడానూ!

సం—అల్లానా! అల్లాజరక్కుండా నేవెళ్ళి మాట్లాడతా, ఈవళంగా వెడతా, సచేలంగా వెడతా!

మా—మీగౌరవం మీరు నిలబెట్టుకోవాలంటే మీరు వెళ్లితీరాలిగా కనిపిస్తోంది.

సం—నేను వెళ్లితీరతా. రోగి ఊరేగి వైద్యుణ్ణి తృణీకరిస్తూంటే వైద్యుడు నోరుమూసుకుంటాడా? అతణ్ణి పట్టుకుని నాసలహా ఇచ్చితీరతాను.

మా—మీరుబాగా అన్నారు. నేనే మీరైయుంటే, అతనికి తనివితీరా మందులు వేసేంతరవాతే గాని, ఈలోపల, అతడికి చచ్చినా పెళ్లికానివ్వను.

సం—నేనూ అంతే. అతడికి చచ్చినావైద్యంమానను (అని గబగబా ఎడమ ఎదరికి పోతాడు)

మా—(కుడి ఎదరికి నడిచి) సరి, వీడు అభిషేకం దగ్గిరికి వెడతాడు. మాయలో పడిపోడానికి అభిషేకం ఒకటోరకం—అనగా అల్లుడికి చింతాకువాసైనా తీసిపోని మామగారు. నేనూ వెడతా! అభిషేకం గారి మీద మరో ప్రయోగం చెయ్యాలిగా!

(అని, కుడి ఎదరకి పోతూండగా, రెండో తెరలేస్తుంది)

నాదగ్గిర వైద్యానికి చేరాడు.

అ——వెనకట్లోనా ఏమిటి?

స——కాదు, ఇప్పట్లో——గంట కిందట!

అ——హారి వీడి రోగం చల్లగాఉండా! అయితే ఏం వచ్చిం దిప్పుడూ!

సం——వినండి. అతని వ్యాధి మీద నాకు మోహం కల్గింది, గ నుక ఆ వ్యాధి నా ఆస్తి. మా శాస్త్రప్రకారం నామందులు అత డు స్వీకరించి నా వ్యాధి నాకు యిదరా ఇచ్చి నన్ను తృప్తి పరి చే లోపుగా, అతనికి పెళ్లి గాని మరొకటిగాని జరపడానికి నే ను అనుమతి ఇయ్యను.

అ——(ఆశ్చర్యపడి) ఏమిటేమిటీ! అల్లాయితే అతడు ఎదైనా రోగంతో తీసుగుంటున్నాడాఏమిటి కొంపతవ్వి!

సం——ఆ. ఒక పెద్దరోగంతో భాటంగా తీసుగుంటున్నాడు.

అ——అయ్యో అయ్యో! అతడికొచ్చిన పెద్దరోగమేమిటో దయ చేసి చెప్పండి.

సం——ఆక్షోభ మీకెందుకు పోనిస్తురూ! ఏదో...

అ——నాకెందుకేమిటీ? పడిసినట్టే ఉంది. ఏమిటో చెప్పండి.

సం——అబ్బ! వైద్యులుగుప్తంగా ఉండి తీరాలి. ఆసంగతి ఎత్తకండి. ఆరోగికి పెళ్ళిమాత్రం వద్దు. చేశారా మీకూమీ అమ్మాయికీ చిక్కులు తప్పవ్. పైగా, మావైద్యపరిషత్తుకి కోపం వచ్చి మీకు బోలెడు వ్యాధులు సంక్రమించేటట్టు చేస్త య్యగలదు. నేచెబుతూన్నదివొట్టి భేషజం కోసంకాదు,జాగర్త.

అ——అల్లాయితే, మాఅమ్మాయిపెళ్ళి ఆపేస్తాను.

సం——ఏం జేస్తాం మరి! ఆపడం తప్పదు. అతను నా వైద్యాధీనంలో ఉండి తీరాలి.

అ——అల్లాగే కానీండి.

సం——వాడు పారిపోయినా లాభం లేదు. నా మిత్రులచేత అతడికి శిక్ష వేయించి, అతన్ని పట్టించి తెప్పించి, నా వైద్యం ఆచరించి తీరతాను.

అ——అల్లాగే కానీండి.

సం——ఒక వేళవాడు కనపించక పోతే,

అ——ఆఁ

సం——పూచీ మీదేగనక, నా వైద్యం మీకు జరిపిస్తాను.

అ——అయ్యో, నాకా? నేను రాయల్లా ఉన్నాను, నాకెందుకూ వైద్యం?

సం——మీరు ఎంత రాయల్లాఉన్నా సరే ఫర్వాలేదు. నాకు ఎవరో ఒక రోగి ఉండాలిగనక, వీలును బట్టి ఎవరైనా సరే రోగినిగా స్వీకరించగలను.

అ——స్వీకరించండిగాని, నేనుమాత్రం రానండోయ్. (తనలో) వీడి మొహంలా ఉంది.

సం——వీలునుబట్టి అనిచెప్పానుగా! (అని, లేచి, తొందరతొందరగా, బెదిరింపు వైఖరితో, ఎడమ మధ్యకి వెళ్ళిపోతాడు)

అ——(సంతానం కేసి చూస్తూ ఎడమమధ్యదాకా వెళ్ళినంతసేపు చూసి, నిదానంగా) రోగంలేని వాడి రోగం కుదురుస్తాట్ట, ఏం

రోగనా!

(కుడివైపునించి, తలుపులు కాబూలు వర్తీవ్యాపారస్తుడి వేషంలో వస్తాడు)

త—(కుడిచెయ్యి నుదుటికి తాకిస్తూ) సలాం అండీ.

అ—(కుడికి తిరిగి) ఎవరుమీరు?

త—మన్పేరూ జమాల్‌ఖాఁ ఉన్నాడు.

అ—ఎక్కడున్నాడూ?

త—క్యా అయ్యా, మేం కాబూల్ డబ్బాఫాయిదా మన్సి.

అ—అల్లానా, రండి, కూర్చోండి. (అని, వాడు కూర్చున్నా తను నుంచుంటాడు) ఏమిటిపని?

త—(కూర్చోబోతూ) కొంచెం చిన్న ఖబర్ కావాలా. మీరూకూచో.

అ—కూచుంటాన్లెండి. చెప్పండి.

త—ముకాముక్ కూచోండి, నైతో మాదీ ముతీ విప్పం

అ—అల్లాయితే సరేనయ్యా! సరే! (అనికూచుని) ఏమిటి సంగతి?

త—యహా పత్తన్ మే, అప్పేకం—అప్పేకం పేరూతో ఆద్మీ ఉంది. తెల్సునాసకీ!

అ—ఆ.

త—సంతోసం. దయచేసి చెప్పు. వాడు హెట్వాంటివాడు?

ఇచ్చివేస్తాం అనిజెప్పేయేశాక్.

అ—ఓరి నీడుశ్వవై పోనూ! పెళ్ళి అయింతరవాత బాకీలుతీర్చే
స్తానని వాయిదాలేసి జరుపుకొస్తున్నాడా?

త—హాో మహారాజ్! ఇఖ ఈ షాదీ ఎప్పూ అయితుంది
రా అని నాక్ పట్టి సూస్తూ ఉన్నార్, మేం.

ఆ—మంచిపనే, అల్లాచూస్తూండండి పనిజరుగుతుంది. అ
యితే మరినాకు సెలవ్.

త—(లేచి) సెలవ్, తమ్రిమీదయాకీ షలాం.

అ—(లేచి) కృతజ్ఞుణ్ణి.

త—ఈచోటీ ఖబర్ తమ్రూ నాకీ ఇచ్చినందుక్ మీకీ
సౌవాజార్ షలామేం.

ఆ—సరే సరే (అనితొందరగా కుడిమూలకి పోతాడు)

త—(ఎడమఎదరికివెళ్ళి, కొంతడ్రెస్సు తీసేసి తను తలుపులు
అయినట్టు సభకి వెళ్ళడిచేసి) అక్కడ వ్యాపారం, అనుకున్నట్టే
నడిచింది. పెళ్ళి తరవాత వేషం తయారవుతాను. (అని ఎడమ
ఎదరికిపోతాడు) —(తెర)—

## 5 వ రంగం

(రెండో తెర ఎకట. పరిగెత్తుకొచ్చినప్పటి ఆ యా సంతో
శరకోపం కుడి ఎదరనించి ప్రవేశిస్తాడు)

శ—(వచ్చి కుడివేపు చూసి) వీళ్ళని చంపెయ్యా! ఏముటో

వీళ్ళ అభిప్రాయం! కుంక ఎవరేనా పోగొ ప్రశ్నించే వాళ్ళు
లేదు కదా అని!

(ఎడమ వేపు తిరిగేసరికి నాలోనే ఒక దినుసు)

—ఏమిటండీ, మిత్రమా! పోసి తీస్తున్నా! (అని
ఊసూరుమంటాడు)

మా—(ఎడమ ఎదురనించి తోసుకువస్తూ) మీ
సామానూ...

శ—దిక్కుమాలి సామాను తీస్తున్నా!

మా—అయ్యో, అదేమిటండీ! ఏమున్నా జరిగిందా
ఏమిటి? ఏమిటి తమ బాధ?

శ—ఏముందీ! ఎటు చూసినా ఇంజెక్షన్ సూది కనబడు
తోంది.

మా—(నమ్మనట్టు) ఛ ఛ. అదేమిటండోయ్!

శ—నన్ను ఆ యింట్లో అప్పగించారేం, అక్కడ నాకు
జరిగిన మంగళం మీరు ఊహించలేరు.

మా—అయ్యోయ్యో! ఏం జరిగిందండీ!

శ—అక్కడ నాకు మాంచి భలారం పెడతారు గావును
పోనీ లోపలికి పుచ్చుకుందాం అనుకుంటిని.

మా—ఆఁ. పెట్టలేదూ?

శ—అబ్బే భలారమూ లేదు దిబ్బాలేదు. "మిమ్మల్ని
వీరి చేతుల్లో ఉంచుతున్నాను" అని చెప్పేసి ఇందాకటి
వాడు తోక ముడిచాడు. ఇంతలో దెయ్యాల్లాంటి డాక్టర్లు,

మగడు-వాళ్ళమధ్య కుర్చీలో నన్ను పాతేసి చెరోచెయ్యీ చూశారు! ఇదో చిహ్నం—ఇదో దాఖలా—ఇదో లక్షణం—అంటూ గింజుకుని ఆ బొంత కుక్క లిద్దరూ కూడబలుక్కుని నాకు వెర్రి అని తేల్చారు. అక్కణ్ణించి, వాళ్ళిద్దరూ నన్ను ఒంటరిగాణ్ణి చేసి పడగొట్టి," మంచిపని చేస్తుంది, పుచ్చుకోండి, నిమిషం. కళ్ళు మూసుకోండి", అంటూ మొదలెట్టి ఆ మాయదారి ఇంజక్షన్ సూది పుచ్చుకుని నా జబ్బలు గిచ్చూ చిటుకూ చిటుకూ విస్తరి కుట్టినట్టు కుట్టేశారు.

మా—అది సరిగానండీ, ఏమిటంటారు వాళ్ళ అభిప్రాయం? దీని కర్థం ఏమన్నమాటా?

శ—ఏమన్నమాటా, నేనంటే పడిచచ్చి పోతూన్నట్టు నటించి నన్ను అక్కడ దింపాడే, ఆ పీనుగు కేవలం మాయల మారి పీనుగన్నమాట! ఇంక వాళ్ళ అభిప్రాయంతో పనేమిటి నా బొందా!

మా—అయ్యో అయ్యో! ఇల్లా ఎక్కడేనా ఉంటుందండీ!

శ—ఏమో గాని ఇక్కడ అల్లా ఉంది. పైగా, డజను మంది తుంటరి భడవలు నన్ను వెంట తరిమారు. వాళ్ళని తప్పించుకుని ఇవతల వడేసరికి సకల గడ్డీ కరిచాను.

మా—(ఆశ్చర్యంతో) గడ్డి ప్రియమేనండీ ఈ రోజుల్లో, ఎల్లా కరిచారోగానీ! ఆహా! జోరు! మనుష్యుల చూపులు ఎంత మాయ చూపులో! వాడు మీకు చాలా

ఆంతరంగిక స్నేహితుడని నేను నమ్మపలికి వచ్చేటట్టు నాకు తోచాడు స్మండి, ఉంటారు గావును అల్లాంటి లుచ్ఛాలు! ఏమి శోద్ధెం!

శ— నాకిహ రోండోఊహే లేదు. ఏవైపు నేను చూసినా నాకేసి పది పన్నెండు ఇంజెక్షన్ సూదులు వస్తూన్నట్టు కనిపిస్తూంటుంది.

మా—ఛ ఛ. అబ్బే బొత్తిగా మరీ పాడైపోయింది. మీ అంత వారిమీద ఇంత కుట్రా ఇంత దౌర్జన్యమూనా, ఓ మోస్తరైతే అనుకోవచ్చు గాని! శృతిమీరి పోయింది.

శ—అన్నను గాని, అభిషేకంగారి యిల్లు చూపిస్తురూ! అక్కడికి చేరుకుంటే మనస్సేనా స్థిమితపడుతుందీ!

మా—(నిర్ఘాంతపోతూ) ఆఁ ఆఁ! ఎవరిల్లెవరిల్లూ!

శ—అభిషేకంగారిల్లు.

మా—ఓహోహో! మీరు శృంగార పురుషులేనండోయ్, రసికులే అల్లా అయితే? అభిషేకంగారి కుమార్తె సంగతి గాని మీరేమన్నా ఎరుగుదురా ఏమిటి?

శ—(నవ్వు మొఖంతో) ఆ, ఆ పిల్లనే నేను పెళ్లాడ బోతూంటా!

మా—(బొమముడితో తీవ్రంగా) పెళ్ళాడ బోతున్నారా?

శ—(సంతోషంతో) మరే!

మా—శాస్త్రీయంగా నేనా పెళ్ళాడబోతూంటా?

శ—అవును, మరో మోస్తరు ఎల్లా ఉంటుందీ!

మా—అల్లాయితే అదేంటనకు లెండిప్పుడు! నన్ను క్షమించండి.

శ—ఏమిటది ఆ అదీ ?

మా—అబ్బే, ఏమీ లేదు.

శ—అహాఁ, చెప్పండి.

మా—అబ్బెబ్బే! ఏం లేదండీ! నేను ఎదో తొందరలో అనేశాను.

శ—అబ్బ! చెప్పండి, బాబ్బాబు!

మా—అబ్బ ఎందుకు విసుగిప్పుడూ ?

శ—అహాఁ అల్లాకాదు, చెప్పాలి.

మా—వద్దండి మహారాజా, నన్ను క్షమించండి, ఎందుకొచ్చింది.

శ—ఇంతేటండీ నాకు ముఖ్యస్నేహితులైౖ ఉండీ!

మా—మహమ్మాత్రటికీ! నాకంటె మీకు ముఖ్యుడెవడూ.

శ—అల్లాంటప్పుడు మన్లో మనకి దాపరికాలు తగునా ?

మా—తగవనుకోండీ, అయినా, ఇరుగు పొరుగు వారి గౌరవాగౌరవాలు నాకెందుకూ అని చూస్తున్నా.

శ—నాకు మీమీదుండే విశ్వాసానికి దాఖలా ఇదిగో (అని ఒక ఉంగరం తీసి మాలోకం వేలికి పెడతాడు) మీ మనస్సు నాకిస్తేగాని నేను ఒప్పను.

మా—(ఉంగరం ధరించి) అబ్బ, నన్ను చాలా ఇరుకులో పడేశారండీ. కాస్త గుక్క తిప్పుగో నియ్యండీ. (అని తనలో

లాగ) హా దైవమా! నాకు పెద్దచావొకటి తెచ్చిపెట్టావే! అవతల తొందరలో లాభసాటిగా తనకూతురికి గొప్ప పెళ్ళిచేసేసి పంపదల్చిన తండ్రి! ఆపిల్లనుగురించిన రహస్యం ఈయనతో చెప్పాలి. ఈయన అమాయకుడు, పరాయివాడు, నన్ను నమ్మినవాడూ! ఆ రహస్యం వెల్లడిచేస్తేనట్టాయినా ఆ కుటుంబంమీద పాడు ప్రచారం చేసినట్టవుతుంది. ఆ రహస్యం కప్పెట్టి ఊరుకుంటేనా ఎరుగుండీ ఈయనకి ద్రోహం చేసినట్టవుతుంది. ఏమో, ఈయనమంచి చూస్తే చెప్పెయ్యాలనేఉంది. పెళ్ళంటే క్షణికవ్యాపారమా, వెయ్యేళ్ళపంటా! ఈయన నన్ను నమ్మిన దాఖలాగా ఉంగరంకూడా ఇచ్చారు. ఇక ఆగలేను, చెప్పేస్తాను.

(పైకి) అయ్యా! మనసారా చెప్పేస్తున్నాను. పరోక్ష జనం గురించి మాట్లాడవలిసొచ్చినప్పుడు వీలైనంత మార్దవంగా ఉండాలని శాస్త్రం చెబుతోంది. నేను అల్లాగే ఆరిందాగా ఉంటాను. ఆ పిల్ల కేవలం భ్రష్టురాలు అనడం కొంచెం ఘాటుగా ఉంటుంది. ఆ పిల్ల కాస్త షోకేళాగా మాత్రం ఉంటుంది అనడం బొత్తిగా చప్పగా ఉంటుంది. కాని, ఆ పిల్ల తనుచూసిన ప్రతీవాడివెనకాలా వెళుతూంటుంది అని చెప్పడం మధ్యరంగంగా సముపాళంగానిజాయితీగాఉంటుందని నామనవి.

శ—(నోరునొక్కుగుని) ఇదా మధ్యరంగం! అల్లా చెప్పు మరీ! అయితే వీళ్ళంతా నన్ను శుంఠకింద కట్ట దల్చారన్న మాట!

మా—(నమస్కరిస్తూ) ధర్మమా మీరల్లా అనడం. ఒక్కొక్కప్పుడు అపవాదం ఊరికే పుట్టచ్చు. కొందరు కొందరు అపవాదం అంటే లెఖ్ఖచెయ్యరు. అపవాదికీ గౌర వానికీ అనుబంధమే లేదని వాళ్ళ ఊహ.

శ—సిఫ్రణ్యమాయిరిలే బాబూ ! ఈ అపవాద నా నెత్తిని కట్టుగోవాలనే కుతూహలం నాకు లేదు. మా కిటికోటి వంశం వాళ్లు సప్కళంకంగా బతికిన ఘటాలు !

మా—(ఎడమ మధ్యకి చూస్తూ) అదుగో అభిషేకంగారు. నే నిప్పుడే మళ్లీవస్తాను. (అని, కుడి ఎదర్నించి జారిపోతాడు)

అ—(ఎడమ మధ్య నించి వస్తాడు)

శ—నమస్కారమండీ.

అ—నమోనమః. విధేయుణ్ణి.

శ—మీరారు అభిషేకంగారులా కనిపిస్తున్నారే !

అ—చిత్తం.

శ—నే నెవర్నో తెలుసా ? శరకోపాన్ని.

అ—ఓహోహోహో ఓహోహోహో ! రండి, ఇంటికెడదాం ఇక్కడే.

శ—(హేళనగా) సరేగానండి, అభిషేకంగారు ! మా పిల్లి సీమ జనం అంతాకుడా మూర్ఖులనా తమరి భావం ?

అ—(తత్తుర్యంగా) మానగరజనం యావన్మందీ గాడిదలనా, తమరి భావం ?

శ—నాకు ఓపెళ్లామే దొరక్కుండా ఉందని నేను ఏడుస్తు

న్నా నుకున్నారా ?

అ—మాపిల్ల ఓ ముగుడే దొరక్కుండా ఉన్నాడని ఏడుస్తోందనుకున్నారా ? .

శ—చెప్తాను నడవండి, మరి.

అ—చెప్తాను రండి, మరి. (అని, ఎడమ మధ్యకి నడవగా వెనకాలే శరకోపం వెడతాడు)—(తెర).

## 6 రంగం

(కుడి పక్క అభిషేకం ఇంటిహాలు కనపడుతుంది. ఎడమ ఎదరనించి మొదట అభిషేకమూ వెనకాల శరకోపమూ వచ్చి కూచుంటారు. కుడిమధ్యనించి సత్యం వస్తుంది)

స—నాన్నా !

అ—ఆఁ.

స—ఇల్లారండి. (అని కుడి ఎదరకి జరుగుతుంది).

అ—(లేచి, కుడిఎదరకి వస్తాడు)

స—(రహస్యంగాలాగ) నువ్ చెప్పిన పెళ్ళికొడుకు వచ్చాట్టగా, నాన్నా ! ఆకూచున్నాయనే గావును. నామనస్సుకప్పుడే అల్లా తోస్తోంది.

అ—అబ్బ. నిమ్మళంగా మాట్లాడు.

స—ఇంకా నిమ్మళంగా ఏమిటి నాన్నా ! ఆయన అందాలపుట్ట. ఎంత ఖోగ్గా కూచున్నారో! అయ్యో అయ్యో ! ఎవరి

కైనా నా సరే ఉంటే ఈయనే ఉండాలి భర్తగా! వెళ్ళి ఒక్క మాటు ఎదరపడి హెచ్చరించి రానా, నాన్నా!

అ—అబ్బ ఉండమ్మా. బాగానే వచ్చింది నీ మాటి. ఇంత తొందరకూడదు, కాస్తంత నిదానించాలి.

శ—(నాలికతో చప్పుడుచేసి) నడకలో ఏమి ఆ చకచకా! ముక్కుమీద ఏమి ఆ కోపమూ!

అ—అయితే మాడండీ శరకోపంగారూ! ఇందాకా ఏ కారణం వల్లనో మీరు పెడధోరణిగా ప్రసంగించారో......

స—(శరకోపాన్ని సమీపించి, దీనంగా చూసి, చెయ్యి పట్టుకోడానికా అన్నట్టు నటించి) అయ్యా! మిమ్మల్ని చూసింతరవాత నాకుపోయిన ప్రాణాలు మళ్ళీ వచ్చాయి. ఇక ఒక్క క్షణకాలంకూడా నేను ఆలస్యం భరించలేను.

అ—సలిలం! చెబుతున్నాను. నువ్వు వెళ్ళిపో. ఊఁ.

శ—(తనలో) ఆహాహా! అరమరలులేని ఒయ్యారిభామ! సభాకంపం లేని సులభసాధ్య! భయభావం లేని స్వేచ్ఛామూర్తి!

అ—ఏమండీ! మీరు ఏధైర్యం చొప్పున ఇందాకా...

స—(శరకోపాన్ని సమీపించడానికి యత్నిస్తుంది)

శ—హా దైవమా! హా హృదయమా! ఓసి వివాహమా!

అ—(సలిలంతో) అరే! మళ్ళీ అదేధోరణి. చెబుతూంటే నీక్కాదూ!

స—మీరు నిశ్చయించిన నాభర్తని నేను ఆరాధించకూడదా, నాన్నగారూ!

అ—(కోపంగా) కూడదు. నువ్వేముందు లోపలికివెళ్లు.

స—పోనీ వారిని చూసి ఆనందించనీండి, నాన్నా.

అ—చెబుతున్నాను. లోపలికి, పో

స—పోనీ, దూరంగా నుంచుంటాను, మీరొప్పుగుంటే.

అ—నేను ఒప్పుగోను. తక్షణం గనక నువ్వు ఇంట్లోకి వెళ్ళకపోతే......

స—సరే. అల్లాయితే వెళ్ళిపోతాను.

అ—(శతకోపంతో) మాపిల్ల వొట్టిమూర్ఖురాలండి, దీనికి అభం శుభం తెలియదు.

శ—(తనలో) ఎల్లా తెలుస్తుంది! ఈపిల్లనునన్ను నన్ను గురించిన ప్రేమతో నిండిపోయింది కాబోలు!

అ—(సలిలం ఇంకా ఆగగా) నువ్ వెళ్ళవా?

స—వెడతాను గాని, నన్ను వీరికిచ్చి పెళ్ళిచెయ్యడం ఎప్పుడో చెప్పండి.

అ—ఎన్నడూ ఉండదు. నిన్ను ఈయన కివ్వాలని ఉద్దేశించలేదు.

స—నన్ను వీరికే ఇచ్చితీరతానని మీరన్నారు. మీరన్న మాటతప్పకండి. అయ్యో! నాకు వీరేకావాలి, వీరేకావాలి నాకు.

అ—నిన్ను ఇతడికే ఇస్తానని సీతో నేను అనుంటే, ఆ మాట ఇప్పటితో రద్దు!

శ—(తనలో) నన్ను నల్చుగుంటుందా అన్నట్టు నాకేసి

ఎల్లాచూస్తోందో, పాపం, ఆఁ...

స—మీఇచ్ఛ ప్రకారం మీరు చెయ్యండిగాని, ఎవరు వద్దన్నా సరే, మా యిద్దరికీ పెళ్ళితప్పదు.

అ—అది రద్దు చెయ్యవలసిన మోస్తరు నాకు తెలుసు. ముందే చెబుతున్నాను. పో. పిల్లకి బొత్తిగా మతిపోయినట్టుంది.

స—(వెళ్ళలేక వెళ్ళలేక వెడుతూన్నట్టు కుడిమధ్యకి వెళ్ళిపోతుంది)

శ—అయ్యా, కాదల్చిన మామగారూ! మీరు అంతగా శ్రమపడి పోకండి. మీ అమ్మాయిని లేవదీసుకుపోయే ఉద్దేశం నాకులేదు. నాకీ విసినికర్రని అంటగట్టాలని చూస్తున్నారుగావును, ఈఅమ్మాయిలాంటిది శత్రువుకేనావద్దు, మహాప్రభో!

అ—సరిసరి ఇదోటాపైపెచ్చు! మీకు పరమశత్రువుకేనా వద్దు, మహాప్రభో!

శ—ఏమిటి మీ ఊహ ?

అ—ఏమిటి మీ వెర్రి!

శ—మీ దుంపతెగా, మీయీఆమాటే! శ్రీ కిటికోటి శత కోపం అంటే ఏమని చూస్తున్నారు! నీళ్ళల్లో గేదెని బేరమాడి కొనుక్కునే బాపతనుకున్నారా ? లోకంలో జరిగే సంగతులు తెలుసుగునే పాటి బుద్ధి లేని రకం అని భావించారా! ఉన్నమర్యాద ఊడ్చెయ్యకుండా ఉండే పిల్లనే పెళ్లాడలనే మాత్రం తోచని పసరం అని ఎంచుతున్నారా ?

అ—లేదులేదు. మీ ఐశ్వర్యం ఏమిటో మీకే తెలియాలి

గదా! డాక్టరు దగ్గిర మందుచ్చుకోడానికి బాహాటంగా ప్రవేశి స్తిరిగదా! అటువంటి మీకు, నాపిల్లదాన్నిచ్చి పెళ్ళి చెయ్యడానికి—ఇన్నేళ్ళు నెత్తిమీద కొచ్చిన పీనుగుని—నాకు, ఆలోచనలేదనీ ఇంగిత జ్ఞానం లేదనీ మీబుర్రలోకి ఎల్లాఎక్కిందీ?

శ—నా ఐశ్వర్యమా? నాయింటికొస్తే చూపిస్తాను. వైద్యమా! మందూలేదు మాకుసూ లేదు. ఎవళ్లో ఆ వాదునాపైన వేశారు. నాకురోగంలేదు రోచూర్చాలేదు. పిడిరాయిలాగున్నాను. విస్తరి పత్రంలోని నా ఆరోగ్యం మీరిక్కడే కళ్లారాచూడచ్చు.

అ—అబ్బో! ఈకోతలకేంలెండి, ఆడాక్టరేవచ్చి చెప్పేశాడు

శ—ఛీ, ఆడాక్టరు అబద్ధం ఆడాడు. నేను మహారాజుణ్ణి. చేత కత్తిపట్టుగుని ఆడాక్టరుగాణ్ణి ఎదురుకుంటాను.

అ—ఏది నమ్మాలో నాకు తెలుసులేస్తుమా. మీరు నన్నిక దగా చెయ్యలేరు. వైద్యంగురించీ అంతే, పెళ్లిరోజున మీరు చెల్లించడానికి ఒప్పుగున్న బాకీలగురించీ అంతే?

శ—బాకీ లేమిటీ?

అ—ఒస్ ఒస్. ఏమీ ఎరగనట్టు! ఆ కాబూలీసాహుకారు వచ్చాడుట. సి ఋణదాతలంతా డిక్రీపొందారట నీ మీద. ఎవి మిది మాసాలైందిట.

శ—అరె! ఏమిటీ అర్థంలేని మాటలూ! ఋణదాతలు నామీద డిక్రీ పొందడం ఏమిటీ మీరంటం!

అ—ఇప్పుడదంతా ఎందుకులెండి. మీ కంతా తెలుసు. (ఎడను ఎవరనుంచి 'నాథా నాథా'' అని కేకలు వినిపిస్తాయి)

శ—మిమ్మల్నే గావును, ఎవరో పిలుస్తున్నారు.

("హా శఠకోప నాథా' అని లో పల్నించి మళ్లీ వినిపిస్తుంది)

ఆ—నన్నుకాదు నన్నుకాదు, మిమ్మల్నే? మీతాలూకు స్త్రీ లాడుందే! మీరు స్త్రీ ప్రమేయంలో కూడా ఇంతేనా మహాశయా!

శ—అరె అరె (అని, నిర్ఘాంతపోతాడు)

అ—కనుక్కుంటూ నుండండి. (ఎడము ఎదరకి నడిచి చూసి) మీఆమను కోసమా అమ్మా వచ్చావూ! చెప్పి నీదగ్గరికి పంపిస్తానుండు. (వచ్చి శఠకోపంతో) మీ ఆవిడేటండీ వచ్చినఆవిడా దయచెయ్యండి (ఎడమఎవగ్నించి వినడం నటించి) అల్లానా ఏమండోయ్, మీరు ఆవిణ్ణి పెళ్లిచేసుగుని మూడేళ్లైందిట!

శ—(విసుగుగా) మూడేళ్లైందా? మీమొదం. మీ మొదమూ దాని మొహమూనూ!

అ—మాటలు తిన్నగా రానీండి.

శ—మీరుమాటలు అసలు రానీకండి. లేకపోతేనూ, నేను పెళ్లాడేశానుట! నాకు ఏమాత్రమైనా తెలియదూ ఆమాటే నిజమైతే!

అ—(వినడం నటించి) సరేసరే. వెళ్లమ్మా. నీకు భయం అక్కర్లేదు. వీడి కింకా నాపిల్లనికూడా ఇస్తానా ఇవ్వాడూ!

(ఎడమమధ్యనించి,"నావోయ్, నాన్నా! ఏంనాన్నా; అల్లా చూస్తావేం నాన్నా" అని రెండుమూడు గొంతికలు ఒకమాటే వినిపిస్తాయి. "అమ్మోయ్, నాన్నమగో నేవ్" అనికూడా గట్టిగా

వినపడుతుంది)

—(అటు నడిచి, చూసి, నిదానించి) అయ్యో అయ్యో! మీ పెద్దభార్యా ఆవిడ పిల్లలూాట వచ్చారండీ.

శ—ఏడిశారు పోదురూ!

అ—నేనా వాళ్లా?

శ—మొదట మీరూ తరవాత వాళ్లూనూ! ఇదంతా ఏవో పన్నాగం?

అ—చూ పిల్ల గొంతిగ కొయ్యడానికొచ్చి ఏమిటయ్యా ఇంకా వాగుడూ! ఇదివరకే నీకు ఇద్దరు పెళ్లాలాయె, గంపెడు పిల్లలాయె, తగుదునమ్మా అని పెళ్ళికి మళ్లీతయారయావా బుగ్గని చుక్కెట్టుగుని! సిగ్గువొదిలేస్తే సర్వాన్నీ జయించవచ్చు నన్నా నీధైర్యం! సకాలంలో నాకు తెలిసింది నయమే. లేకపోతే నాపిల్లని సత్రేట్లో ఉంపిన వాణ్ణవుదును.

శ—మీ పిల్ల ఎవడి క్కావాలయ్యా, బాబూ! (అని వెకిలిగా దీర్ఘాలు తీస్తూ దణ్ణంపెట్టి లెంపలు వేసుగుంటాడు)

అ—అల్లా అన్నావు, నచ్చింది. ఉండు. (అని, ఎడమ మధ్య ధ్వని ఆలకించి నట్టునటించి, అటుపరకాయించి) బాబోయ్, కొంపలంటుగున్నాయి, ఆయిద్దరు స్త్రీలూ తిట్టుగుని రక్కుగుని కొట్టుగుంటున్నారు. మీరుతనకే భర్తఅంటే తనకే భర్తఅని ప్రతి స్త్రీ దెబ్బలాడుతోంది. ఇద్దరికీ బుజువులున్నాయిట

శ—మీ అమ్మాయినికుడా వెళ్లమనండి, పూర్తవుతుంది.

అ—మా అమ్మాయి అల్లాంటి రకంకాదు.

శ—నిజమే మరీ. మీా అమ్మాయి ఆడవాళ్ళ వెనకాల కాదు, పాపం, మొగాళ్ళ వెనకాల పరిగెడుతుంది.

అ—ఏమిట్రా నీ పేలాపనా, వ్రైరిపీనుగా! కర్ర తెస్తా నుండు. (అని కుడిమధ్యకి పరిగెడతాడు)

శ—అయ్యో! ఏమిటి నాకీ గ్రహచారం! వీడు నిజంగా తెస్తాడేమో కర్ర! అపవాదలకి తోడు, దెబ్బలు కుడా పడాలి. (దిక్కులుచూసి) ప్రస్తుతం ఇట్లా పోదాం (అని ఎడమ మూలకేసి పరిగెట్టుకుపోతాడు)—'తెర).

# 7వ రంగం

(వీధి. తెర లేవగానే శరకోపం ఎడమ ఎదరనించి గబ గబా విచారంతో వస్తాడు. కుడి ఎదరనించి మాలోకం వస్తూంటాడు)

శ—అయ్యో! వీళ్ళని తగలెగా! నన్ను ఖైమా చేశారు, ఖూనీ చేశారు, ప్రతీచోటా తలో ఖూనీ చేశారు నన్ను! అబ్బ అబ్బ! దిక్కుమాలి ఊరు, యమబాధ.

మా—(తాపీగా) అదేమిటండీ, ఏదేనా వైపరీత్యం జరిగిందా ?

శ—వైపరీత్యమా! ఈ ఊరు డాక్టర్లనీ భార్యల్నీ తెగ తినేస్తోంది.

మా—నాకు బోధపడలేదు.

శ—ఇందాకా డాక్టర్ల గురించి చెప్పానా! దరిమిలాని మళ్ళీ ఎంత జరిగిం దనుకున్నారు! అభిషేకం గారితో మాట్లాడి నేను మరి వచ్చేద్దాం అనుకుంటూంటే, ఒకతుంటరిస్త్రీ చక్కావచ్చి, నన్ను ఉద్దేశించి 'నాథా నాథా' అంటూ రావణాగోల మొదలెట్టింది.

మా—పాపం! ఆవిడ పతివ్రత గావును, లేకపోతే పర్లీకున గొడవ చెయ్యగలదా?

శ—దిబ్బ! దిబ్బా దిరుగుండమూను! నేను పెళ్ళి ఏడవందేటండీ, ఇంతవరకూనూ!

మా—మరుపు ఎంతవాళ్ళకేనా ఉంటుంది, ఏ విషయంలో నేనా ఉంటుంది.

శ—ఏడిసినట్టే ఉంది. మరిచిపోయి మరిచిపోయి పెళ్ళా మరిచిపోడం! దాన్ని చంపెయ్యా, ఒకదాన్ని ఎల్లానా వితగడ చేసుగోడం అని తటపటాయిస్తూంటే, మరో రాయి గాయి స్త్రీ వచ్చింది అయిదారుగురు పిల్లల్ని వెంటేసుగుని!

మా—ఇంకేం! మీ ప్రథమ కళత్రం గావును. ఆవిడ యందు మీ కెందరూ సంతానం?

శ—అంతర్యస్నేహితులైన మీరే నన్ను ఇల్లా అర్థం చేసుగుంటూంటే, ఏమిటి నాకు దారి?

మా—ఛ ఛ ఊరికే అన్నానండీ, (మొఖం తీవ్రంగా పెట్టి) కాలి చెప్పుతో దవడశుద్ధి చేసి అవతలకి పొమ్మని గెంటెయ్యక పోయారటండీ, ఒక్క దెబ్బని దాన్ని ఆ బాల

సంఘాన్ని నీ్న !

శ—అల్లాంటిపనే చేద్దాం అని నాకూ అనిపించింది. ఇంతలో ఆ స్త్రీ లిద్దరూ కలబడ్డారు—'నా ముగుడే శఠకోపం' అంటే 'నా మగుడే శఠకోపం' అంటూనూ. ఆ వీధులో బోలెడు జనం జేరారు!

మా—ఆ జనాన్ని కొడదాం, రండి.

శ—అబ్బ వద్దు. ఈ సలిలం విషయం ఇన్నినీళ్ళు వాదులు కుంటాను. ఈ అభిషేకానికి ఒక దణ్ణం. నాకు పెళ్లేవద్దు దైవమా ఇంతటితో పోదాం అనుకుంటూంటే, నాకు లోగడే రెండు పెళ్ళిళ్ళు నాకు తెలియకపోయినా యూషీగా అయినా యని మొదలెట్టారు తక్కిన వాళ్ళంతా! వాళ్ళు నాశనం అయిపోనూ!

మా—మీరు వాగ్దానాలు చేశారేమో! పని తొందరలో మరిచిపోయారేమో!

శ—పోనీ మొదటి పిల్లకి వాగ్దానం చేశాననుకో! రెండోదానికి—అది ఓ మంద పిల్లల్ని కూడా తోలుకొచ్చింది పిల్లల కోడిలాగ! చూశారా! సిగ్గులు పోయినాయండీ స్త్రీలకీ!

మా—నిజమే. బుద్ధులు నశించాయండీ పురుషులకీ!

శ—మరో చిక్కొచ్చింది.

మా—ఏం చిక్కూ?

శ—ఆ యిద్దరు స్త్రీలూ నాకు పూర్వాన్నించీ భార్యలే

అని వేరు వేరుగా లిఖితపూర్వకంగా ఋజువులు తీసుకొచ్చి చూపిస్తారుట.

మా—ఆఁ ఏముందీ, మనవర్తులకోసం గావును!

శ—ఆఁ అవి మాత్రం త్వరగా తెములుతాయా? నోటీసులు, విచారణస్థల నిర్ణయాలు, స్టెయిటులు, ఎన్నెక్షన్లు, సమన్లు, వకాలత్ లు, సాక్ష్యాలు, సంపన్నాలు, వాయిదాలు—ఇల్లాగా కోర్టు తంతు నడుస్తుంది.

మా—మీకు న్యాయ శాస్త్రం బాగా వచ్చునండీ!

శ—అబ్బే, నేనాశాస్త్రం చదువుకోలేదు. చిన్నప్పట్నించీ నామాటధోరణే సహజంగా అల్లా అయిపోయింది. అదిగాక నాది మాంచి ఇంగితజ్ఞానం. దాంతో కొట్టుకుపోతున్నాను ఎన్ని ఒడిదుట్లు వచ్చినా!

మా—ఎమో, మామూలు వాళ్ళకి ఈధోరణి అబ్బదు.

శ—అయినాసరే, ఎవర్నైనా లాయర్ని సలహాచేద్దాం నడవండి. ఈవ్యవహారం చూసుకుని మరీ పోతాను, ఈఊర్నించి.

మా—రండి. పెద్ద వకీలింటికి వెళదాం.ఎంత చిక్కొచ్చిందీ. (అని కుడి ఎడరికి, ముందుగా, నడిచిపోగా, శరకోపం అతని వెనకాలే వెడతాడు).

## 8వ రంగం

(వీధి. తెర లేవగానే, కుడివైపునించి మాలోకమూ, ఎడమ ఎడరనించి నవనీతమూ వచ్చి కలుస్తారు).

న—ఏంమామాలోకం! ఎట్లా ఉంది వ్యవహారం?

మా—నిమ్మకాయ వాటంగా ఉంది.

న—నిజమం?

మా—తప్పదు.

న—తప్పదులే! మనకేనా అని.

మా—సందేహమా! శరకోపం లోకం అంటే ఎరగడు.

న—బుద్ధి?

మా—మట్టి—చౌడు.

న—ధైర్యం?

మా—జారు. ఇక్కడి న్యాయచట్టాలు తెలుసుగుని బెంగెట్టుకున్నాడు

న—అతని కార్యక్రమం?

మా—శీఘ్ర పలాయనం.

న—అంతటితో ఆఖరేనా మనఆట?

మా—"పలాయనం అంటే అనుకున్నంత తేలిక కాదు. నగర ద్వారాలదగ్గిర మీకోసం జనం కాశారు. పోల్చిపెట్టేస్తారు." అని వాడికి పిరికిమందు వేశాను.

న—మరి?

మా—మరేముందీ, ఆడవేషం వేసుకుని వెళ్ళిపొమ్మన్నాను.

న—బలే. ఆడవేషంలో కుడా అతణ్ణి చూడవలిసిందేనూ!

మా—జాగర్తండోయ్. ప్లానుప్రకారమే చెయ్యాలి. ఏం చేసినా నేను అతనితో వ్యవహరించే వేళ, మీరు వెళ్ళి...(అని

చెవులో ఏదో చెప్పినట్టు నటించి) తెలిసిందా?

న—ఆ,

మా—ఇతణ్ణి ఆడవేషంలో ఇక్కడ వొదిలి, నే వెళ్ళి అభిషేకంగారితో...ఊఁ...అది!

న—(తలతిప్పుతూ) అవును, అదే ఎత్తు.

మా—మరిసరి. మన నూతన వధువు—శరికోపరూపిణి—ఇల్లావస్తోంది. (అని ఎడమ ఎదర చూపించి) మీారు ఇల్లా (కుడిఎదర చూపిస్తూ) వెళ్ళండి. మనం కలిసినప్పట్లో వారు చూడకూడదు.

న—(కుడి ఎదరకి పోతాడు)

శ—(ఆడ వేషంలో సన్నటి బట్ట ముసుగు వేసుకుని ఎడమ ఎదరనించి వస్తాడు)

మా—రండి, రండి .మిమ్మల్ని గుర్తుపట్టడం బ్రహ్మాతరం కాదు. మీారు అచ్చంగా గొప్ప కులకాంతలా కనిపిస్తున్నారు.

శ—ఈ సీనులో న్యాయం బొత్తిగా పాల్గొందే అని నాకు ఆశ్చర్యం వేస్తోంది.

మా—నిజమేనండి. ఇక్కడ ఓంప్రథమంలో ఉరి తీసెయ్యడ మున్నూ తరువాత నిమ్మళంగా విచారణ ప్రారంభించడమున్నూ!

శ—అటువంటిది ఎంత అన్యాయమైన న్యాయమో చిత్తగించారా?

మా—చాలా రాక్షసంగా ఉంది.

శ—అందులోనూ అమాయికులపట్ల, మరీ రాక్షసం

అనిపిస్తుంది.

మా—పైగా, మిత్రమా! ఆపిల్లిసీమ వాళ్ళంటే ఈఊరు జనానికి మరీ ఆగ్రహం. వాళ్ళని ఉరితీసిః కొద్దీ వీళ్ళకి పండగ.

శ—ఓరి వీళ్లు ఇదైపోనూ! వీళ్ళకి మాసీమవాళ్ళు చేసిన ద్రోహమేమిటండీ?

మా—నాకెల్లా తెలుస్తుందండీ! వీళ్లు శుద్ధమృగాలు. ఇతర ఊళ్ళవాళ్ళ నెవ్వరిదీ ప్రజ్ఞా అంటే వీ[illegible] పడనే పడదు. మిమ్మల్ని గురించి నాకు మరీ భయంగాఉంది, మిమ్మల్ని ఏంజేసి పోతారో అని.

శ—ఏంజేస్తారు మహా! చంపుతారు. ఇంతేనా! మరణం అంటే నాకు భయమేలేదు. అది సయం. కాని, స్త్రీలు వస్తూం డడం, నాథా నాథా అంటూపిలవడం, మనువర్తులు కోరకం— ఇవీ నాకు భయంవేసేవి. వీటింగో నాదర్జా పోయింది.

మా—నిజమేనండి. కాని, ఇప్పుడు మీారు స్త్రీపాత్ర అభినయించాలి—ఆ వైఖరీ, ఆ మాటా, ఆ నడకా, ఆ ధోరణీ, చూపించాలన్నమాట.

శ—ఏమీా ఫర్వాలేదు. నేను బోలెడుమంది స్త్రీల వైఖరులు గమనించాను గనుక వాళ్లని అనుకరించగలను. రూపంలోనూ చాలావరకు మారి పోయానుగాని నాకల్లా ఓకక్క ఒక్కటే పట్టుకుంది.

మా—ఏమిటండీ!

శ—కాస్త మీాసం మిగిలిపోయింది.

మా—ఓస్ ఇదీటండీ, ఆపట్టింపు మీకక్కర్లేదు. ఈ మాత్రం మీసంగల పురుషేతరులు లేకపోలేదు. ఏదీ ఏదీ, ఒక్క ఆడ విసురు చూపించండి.

శ—(స్త్రీలాగ సిగ్గు అభినయించి నుంచుంటాడు)

మా—నడవండి.

శ—(స్త్రీలాగ తిక్కుతూ నడుస్తాడు).

మా—తిప్పుగోండి.

శ—(స్త్రీలాగ నడుంకోగిస్తాడు)

మా—ఓ ఫస్టూ. మీకీ చేష్టలన్నీ సహజంలాగనిపిస్తున్నాయే!

శ—(మెడ రుబ్బుతూ, గడ్డంకింద వేలెట్టుగుని, కళ్లుమిటకరిస్తాడు).

మా—బలే, రెండు మాటలుకూడా అనండి.

శ—(అభినయిస్తూ) ఏం? నా బండీ లేదూ? ఏదీ నా బండీ! ఏమిపాట్లర్రా! కర్మంకొద్దీ దొరుకుతారు ఇటువంటి దాసీలు! ఏమర్రా! రాత్రిరి దాకా వీధుల్లోనుంచోనా! ఎవళ్లేనా బండీ పిలవండర్రా!

మా—చాలా బాగుందిస్మండి.

శ—(అభినయిస్తూ) ఎవరోయ్! బండి అబ్బాయి! ఏమిపాగహూం! కుర్రాడా, ఓరి కుర్రాడా! ఏమికొంప్పా! ఉండు, తిరిగొచ్చి రడా తిరగేస్తాను—పొట్టి కుర్రాడా, ఎక్కడరా, నీముచ్చ మాయా, భూమ్మీద లేకుండా పోయాడు వీడు. ఎవళ్లూ వెళ్లి వాణ్ణేనా పిల్చుగు రారేం మొద్దుల్లాగ!

మా——అత్యద్భుతంగా ఉంటుందండీ, ఒక్కవిషయమే కొంచెం అసందర్భంగా ఉంది. ఈపైముసుగు మరీ పల్చగాఉంది. వెళ్ళి కొంచెం దళసరిముసుగు తెస్తాను. మీ మొహానికి మంచి ముసుగుంటే ఎవ్వరూ మిమ్మల్ని చూడకుండా అందర్నీ మీరు చూడచ్చు.

శ——మీ రొచ్చే లోపల నేను ఏం జేస్తూండనూ!

మా——నాకోసం ఎదురు చూస్తూండండి! ఇక్కడున్నట్లు వచ్చేస్తాను. అటూ ఇటూ తలాయిస్తూ ఉండండి. (అని కుడి ఎదరకి పోతాడు)

శ——(కొంచెంసేపు ఇటూ అటూ తిరిగి, ఎడమ ఎదరకేసి జరిగి, ఆగి, నిదానించి, భయపడి) బాబోయ్! ఇరుగో ఇరుగో ఎవరో తుంటర్లు! నన్ను చూశారు, ఇల్లా వస్తున్నారు. తాగినట్లు తూల్తున్నారు. ఇహ వచ్చిపడతారు. ఏందారి భగవంతుడా! (కుడివేపుసూచిస్తూ) ఇల్లా పారిపోతే, నయమే. కాని, ఆస్నేహితుడు నేను కనిపించకపోతే వెతుక్కొని బాధపడతాడు. (మళ్ళీ ఎడమ ఎదరచూసి) అరుగో పోగరుమోతులు, నవ్వుతున్నారు. గాలిలోముద్దులు పెట్టుగుంటున్నారు. మీముద్దులు ముక్కలైరి గదర్రా, బడుద్ధాయి గాడిదల్లారా! నేను పట్టుపడి పోతాను. వాళ్ళిద్దరున్నాగా. నేను కొంచెం అల్లరి చేస్తేగాని ఈగండం గడవదు. (అని కుడివేపు వెళ్ళి) ఏమండోయ్, ఎవరేనా పుణ్యాత్ములు రండి, రండి వచ్చి రక్షించండి, తుంటర్లు నన్ను చంపి దోచుగోడానికి వస్తున్నారు, రండి బాబూ రండి.

(పోలీసు వేషంలో తలుపులు కుడి ఎడరనించి వస్తాడు)

త—ఏయ్! ఎవరమ్మా అదీ!

శ—(సిగ్గుపడుతూన్నట్లు) నేనండీ, ఒకచిన్న దాన్ని.

త—ఏమిటి తమ బాధ?

శ—(ఇంకా సిగ్గుతో తలవంచుగుని) మరండీ! (అని, చిరు నవ్వుతో లాగ) తుంటర్లవల్ల బాధండీ.

త—ఏరీ?

శ—మీరు రావడం కనిపెట్టి ఈవేపు పరిగెట్టారండి (అని ఎడమ మధ్య చూపిస్తాడు)

త—(ఎడమ మధ్యకి పరిగెట్టి వెళ్ళివచ్చి) వాళ్లని తరిమేసి వచ్చానండీ. వాళ్ళు పారిపోవడంలో ఒకరిమీద ఒకరు పడి పోయారు. మీరు భయపడకండి.

శ—(దసువుగా) మీరుంటే నాకు భయం ఎందుకండీ! మీకు దణ్ణంఅండి. మీకు ఎంతేనా కృతజ్ఞురాల్ని.

త—(శరకోపం మొహం పరీక్షగా చూసినట్టు నటించి) ఉండండి, ఈ ముఖం వర్ణన నేను లోగడ ఎరుగున్నట్టుందే!

శ—అబ్బెబ్బే! మీ రెరుగున్నట్టున్న మొహం మరొకరిదై ఉంటుంది. నా మొహం కాదు.

పూ—మీ మొహం కాదూ? మీ మొహంలా ఉంది! అసలు మీరు అల్లా ఎందుకు అనవలిసొచ్చిందీ?

శ—నాకేమీ తెలియదండి, అనూయికపు మనిషిని.

త—మీమాటలు కొంచెందవ్వందవ్వంగా అర్థ మిస్తున్నాయి.

అందువల్ల మీరు నా ఖైదీ.

శ—మీకు మొక్కుతున్నాను, రక్షించండి.

త—వీల్లేదు, వీల్లేదు. మీ ముఖవైఖరీ మాట వైఖరీ గమనించగా, మీరు కేవలం ఆ శరకోపంగారులా ఉన్నారు. వారు పరారీ అయారని తెలిసి వారికోసం మేం వెతుకుతున్నాం. మీరు మమ్మల్ని మోసపుచ్చుదాం అనుకున్నారు గాని వ్యర్థం అయింది. పదండి ఖైదులోకి.

శ—అయ్యో, నా అవస్థా!

మా—(కుడి ఎదర్నించి వచ్చి) హా దైవమా! ఏమిటీ అవస్థా!

శ—అవస్థేనండి. నేను స్త్రీని కానట్టు పోల్చేశారండి.

త—నేనేనండి పోలుస్తా. మా క్షోభ తగ్గిపోయింది కుడానూ!

మా—(తలుపులుతో) అయ్యా అయ్యా! నన్ను చూసి వార్ని విడిచిపెట్టండి. మేం చిరకాల స్నేహితులం.

త—మేం చెయ్యగలది ఏమీ లేదు.

మా—అయ్యా! మీరు సబబుకి కట్టుపడే న్యాయ ప్రభువులని నాకు తెలుసు. సబబైన మొత్తం కొంత తమరు పుచ్చుకుని, మార్గాంతరం కనిపెట్టుగోడానికి న్యాయం ఒప్పదంటారా?

త—అయితే ఉండండి, నా తోటివాళ్ళందర్నీ పంపించేసి వస్తాను. (అని కుడిమధ్యకి వెళతాడు).

మా——మిత్రమా ! కొంతసొమ్ము పైకి తియ్యండి. ఎంతో కొంత చేతిలో పడితేగాని, వాడు మిమ్మల్ని వదలడు. త్వరగా తియ్యండి పది.

శ——(ఒక నోటు తీస్తూ) వచ్చి వచ్చి రాక్షసి ఊరొచ్చాను, తీరిపోయింది. ఇదిగో. (అని ఇస్తాడు)

మా——(నోటు పుచ్చుగుంటాడు)

త——(కుడిఎదర్నించి వచ్చి) నాతోటి వాళ్ళని పంపేశానండి. ఏదీ మీా సబబు కానీండి.

మా——ఇదుగోనండి. (అని పది-నోటు ఇయ్యబోతాడు)

త——ఎంత ఆ సొమ్ము ?

మా——పదండి.

త——టట్ ! పదండి ఖైదులోకి. మా అధికారి మా చెడ్డ కరకట్టురకం (అని కుడివేపు వెళ్ళిపోవడానికి యత్నిస్తాడు)

మా——(తలుపులుతో) అయ్యా, దయచేసి ఆగండి. (శరకోపంతో) అయ్యా, మీారు కిక్కురుమనకుండా మరో కూ నోటు రానీండి ఇటువంటిది !

శ——అయితే. . .——

మా——అయితే గియితేఅంటూా నాన్చడం ప్రారంభించారా మీాకు ఖైదు తప్పదు. ఖైదు నయమా? కాగితాలు రెండు గిరవాటెయ్యడం నయమా ? త్వరగా తియ్యండి.

శ——నా ఖర్మం కాలింది పుచ్చుగో (అని, మరో పది నోటు ఇస్తాడు)

మా—(అది పుచ్చుగుని) ఇవిగోనండి.

త—(మళ్ళీ పది కలిసి పుచ్చుకుని) సరే. ఈయన్ని నేను క్షేమంగా తీసికెడతాను. ఈయన్ని గుప్చిప్‌గా దాటించెయ్యాలి, నే నెళ్ళొస్తాను. మీా రుండండి.

మా—చిత్తం, వీరి పూచీ రావత్తూ మీాది.

త—ఆ. వార్ని పొలిమేర దాటించి వచ్చే భారం నాది!

మా—మిక్కిలి జాగ్రత్త స్సుండీ!

త—(తనలో) ఔరా! ఈయన కెంత ఆప్యాయమో! ఈపూళ్ళోకల్లా నిజాయితీమనిషి ఈయనగదా! (పైకి) నడవండి, బాబూ!

త—నండి. (అని కుడిపెదరకి పోగా, వెనకాలే శరకోపం వెడతాడు. మాలోకం ఎడమ ఎదరకి పోతాడు)—(తెర).

## 9 వ రం గం

[అభిషేకంగారి ఇంటి ఎదటి స్థలం. ఎడమ మధ్యనించి మాలోకం ప్రవేశిస్తాడు]

మా—(కుడిమధ్యకి నడిచి) అయ్యగారండీ! ఏమండోయ్, అభిషేకంగారు!

అ—(కుడిమధ్యనించి వస్తూ) ఏం ఎవరదీ?

మా—ఇక్కడ శరకోపంగా రున్నారాండీ?

అ—ఏమో ఎక్కడున్నాడో, ఆ వెర్రిచవట.

మా—మీది పొరపాటేమో కాని, వాడంత మరీ వెర్రి చవట కాడు లెండి.

ఆ—ఏం ?

మా—అయిఉండంటే మీకింత ద్రోహం చేస్తాడాండీ ?

ఆ—నాకు ద్రోహమా ?

మా—నాకు మీరంటే చాలా జాలేస్తోంది.

ఆ—ఏంజేశాడూ ?

మా—ఏంజేస్తాడూ, మీ అమ్మాయిని అమాంతంగా లేవదీసుకు చక్కాపోయాడు.

ఆ—మా సలిలాన్నే ?

మా—ఆ. మీ సలిలాన్నే. ఆ అమ్మాయి అతనంటే ఎంతో ఇదవుతుంది కదండీ, అందుకని మిమ్మల్ని విసర్జించేసింది. వాడి దగ్గిర ఏదోయక్షిణీ ఉందిటండీ, ప్రతీ అజ్ఞానురాలూ అతన్తో అల్లా వెళ్ళిపోవడమేటా !

ఆ—అరె అరె. నడునడు. నాతోరా బాబూ. పోలీసుల్తో చెబుదాం.

[కండువాచివరతో సలిలంచేతులు కట్టేసి రెండోచివర తను పట్టుగుని వెనకాలే సలిలాన్ని ఈడుచుగుంటూ ఎడమ ఎదర నించి నవనీతం వస్తాడు.]

న—ఔరా! వేషాలేస్తావూ! రా, మీనాన్న గారికి అప్పగిస్తాను. (అభిషేకంతో) అయ్యా! ఇదుగో మీ అమ్మాయి!

ఆ—అయ్యో, అయ్యోయమాతరా! నీకెక్కడ కనపడింది

బాబూ!

న—ఆయనతో ఎవరితోనో పారిపోతూంటే బలిమిని పట్టి తెచ్చాను.

అ—చాలా శ్రమపడ్డావు, నాయనా!

న—మిమ్మల్ని గురించే, ఈవిణ్ణిగురించి కాదు.

అ—ఏం? మా అమ్మాయిని మెచ్చుగోవా?

న—పూర్వం మెచ్చుగునే వాణ్ణికానండీ, ఈవిడ వాడితో అటు పలాయనం చెయ్యడం తోటే నాప్రేమ ఇటు పలాయనం చేసింది.

అ—అమ్మాయీ! ఎంత అపకీర్తి పాలు చేశావు నన్నూ!

స—నువ్వు నిర్ణయించిన వ్యక్తికి నా హృదయం నేను అర్పించడం నీ అపకీర్తికి కారణం ఎల్లా అవుతుంది నాన్నా!

న—అన్నిలోట్లున్న ఆ జంతువుకా నీహృదయం అర్పించడం!

స—మీ కెందుకండీ, ఈ రొష్టూ! నేను వారిని మోహించాను. మా నాన్న కోరిక అది. మీరు ఎన్నట చెప్పండి. ఆయన నాకళ్ళకి మహరాజు, మన్మథుడు. నా ఊహాలో బృహస్పతి, మహాత్ముడు, మీరు లోట్లు అంటున్నారే, అవే ఆయన మహిమలు—నన్నడిగితే.

అ—ఓహోహోహూ! నీ ధోరణి మరీ పెడసరంగా ఉండమ్మాయోయ్! ఆవెర్రినన్యాకి మహిమలుకూడా అంటకడుతున్నావే!

స—వెర్రిమాట అబద్ధం నాన్నా. ఏమోసామూలువన్నీ, ఆయన్ని, పాపం దగా చేసేశారు. ఆ మామయులమూన్నల్లో మొదటివారు (నపనీలాన్ని చూపించి) ఈయనే. కుట్రలు చేసి ఆయనమీద మీకు అసహ్యం పుట్టించారు. ఈ మాట యథార్థం.

న—మోత్తికండీ! అన్ని మాయలు నావల్ల ఏమవుతాయి?

స—అయ్యో, పాపం! మీరు పసిపాపలు.

అ—అమ్మాయి, ఊరుకో. నీకుత్రతంలం మరి చాలించు.

న—అయ్యా! మరిచిపోకండి. మీమీద పడబోయే అపవాద తొలగించిన యువకుణ్ణి నేను.

అ—నాయనా, నీకు నేను మనసారా కృతజ్ఞుణ్ణి.

న—అయితే, మరి సెలవివ్వండి నేను మీ అల్లుణ్ణయే భాగ్యం పెట్టిపుట్టకపోయినా, మీ సేవకుణ్ణి అయానని జ్ఞాపకం పెట్టుకోండి.

అ—బాబూ! నీప్రవర్తన నాహృదయాన్ని స్పృశించింది. నాపిల్లని నీకే ఇస్తాను.

స—(గునుస్తూ) ఊఁ, నాకు భర్త శకోపంగారే అవాలి. మరోరు కాకూడదు. నామాటే నెగ్గాలి.

అ—మువ్వు ఈతక్షణం ఈనవసితాన్నే పెళ్ళిచేసుకుంటా వనాలి, నామాటే నెగ్గాలి.

స—నేను సుతరామూ చేసుగోను.

అ—ఏం? ఎంచేత చేసుగోవూ?

స—నాకు ఈయన బాగుండలేదు.

న—ఏమండోయ్, చూడండి, నేను బాగుండలేదుట! మీరు చెప్పండి.

అ—నిక్షేపంలా ఉన్నావు బాబూ! నీకంటె బాగున్నవా డెవడూ! ఇదుగో అమ్మాయోవ్! నువ్వింకా పెంకిగా ఉంటే నిన్ను శిక్షించవలిసి వస్తుంది.

న—అయ్యా అయ్యా! నన్ను గురించి ఆ అమ్మాయిమీద చెయ్యిచేసుగోకండి, మీకు దణ్ణం.

అ—వీల్లేదు. (నిక్కచ్చిగా) కుర్రది నామాట పాటించి తీరాలి నేను యజమానినని తేలాలి.

స—(తీవ్రంగా) ఈ తండ్రి నాఇష్టం పాటించి తీరాలి. నా హృదయానికి నేను యజమానురాల నని తేలాలి.

న—ఓ తండ్రీ, ఓ పిల్లా! మీరు ఇటువంటి ఘోరప్రతిజ్ఞలు చేస్తే నాబోటిగాళ్లకి చాలాబాధ. ఎవరో ఒకరు తగ్గండి.

అ—నేను పెద్ద వాణ్ణి నా కోరిక చెల్లాలి.

స—నేను చిన్నదాన్ని. నా ముచ్చట తీరాలి.

(తలుపులూ మాలోకపూ కుడిఎదర్నించి వస్తారు)

త—<br>మా— } (రంగంమీద వాళ్లతో) దణ్ణాలండి.

అ—అమ్మాయి! ఆఖరిమాట చెప్పు. నువ్వు నా మాట శిరసావహించి ఈ నవనీతాన్ని పెళ్లాడతావా ఆడవా?

మా—ఆడండి ఆడండి, అమ్మాయిగారు!

స—ఇప్పుడెల్లా? నేను మొదణ్ణించీ ఆ శతకోపంగార్ని ఉద్దేశించాను గనక వీరు నన్ను స్వీకరించను పొమ్మంటే

అ—ఎమోయ్ అబ్బాయి! నువ్వు మా అమ్మాయిని స్వీకరించను పొమ్మంటావా?

న—ఎంతమాటా! అందులో పెద్దలు సెలవిస్తూంటే, తిరుగు చెప్పగలనా!

స—అయితే, సరేనాన్నా!

అ—అమ్మయ్య! (అని నవనీత సలిలాలచేతులు కలుపుతూ) చూశావా అమ్మాయీ! నీకేం తెలుసునూ! చివరకి నా మాటే నెగ్గింది!

స—కాదు నాన్నా! నీకేం తెలుసునూ, మొదణ్ణించీ నామాటేనెగ్గింది!

(తలుపులూ మాలోకమూ చప్పట్లు కొడుతూండగా, తెర పడుతుంది)

—

# ఎవళ్ల గొడవ వాళ్లది!

[మోలియర్ రచనల్లో ఒకదానికి ఇది దగ్గిర అనుసరణం. ఇది మొదటిసారి 17-2-1940 తేదీని రాజమండ్రీ ఆర్ట్సుకాలేజీలో సర్ కె. వి. రెడ్డిగారి ఆధిపత్యంకింద జరిగిన పూర్వవిద్యార్థి వార్షికోత్సవసందర్భంలో, అనుమతితో, ప్రదర్శించారు]

## పాత్రలు

చంద్రగిరి—వరుడు

మాలోకం—చంద్రగిరికి భట్రోతు

కనకాద్రి—వనప్రియపోషకుడు

పాటయ్య, ఆటయ్య, మాటయ్య, మూటయ్య — సోదిరాయుళ్లు

వనప్రియ—కన్య

దమనం—, మరువం— — ఇద్దరుస్త్రీలు

## పాత్రధారులు

శ్రీ దుగ్గిరాల సత్యనారాయణరావు
" ధవిళేశ్వరం సూర్యప్రకాశరావు
" గూడా సూర్యనారాయణ
" వై. వి. యల్. నరసింహమూర్తి
" పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు

శ్రీ టి. వీరభద్రరావు
" మారయ్య
" టి. అచ్యుతరామరావు
" జె. వి. రమణ
" బి. యస్. అనంతరావు

# 1వ రంగం

[చంద్రగిరియింట్లో ఒక హాలు. బల్లా, కుర్చీలూ, సోఫాలూ, అద్దాలూ అమర్చి ఉంటాయి. చంద్రగిరి ఎడమగుమ్మన్నించి వచ్చి, సగంసగం వేషం వేసుకుంటూ, ఎక్కడికో వెళ్ళే యత్నం మీద ఉన్నట్టు కనిపిస్తూ పచారు చేస్తూ—]

చం—వసప్రియకి నన్ను పెళ్ళాడ్డం ఇష్టం అని మూర్తి. ఐనాళ్ళకి ఆమాట నాతో అనెయ్యడానికే నన్ను రమ్మని ఇప్పుడు కబురుచెయ్యడం.

(తొందరపడి) ఒరేయ్, మాలోకం! ఏంరా! మాలోకం!

మా—(కుడిపక్కన్నించి వచ్చి) చిత్తం.

చం—వేళ అయినట్టుంది. తొందరగా వెళ్ళాలి.

మా—చిత్తం.

చం—(ఆగి) అసలు ఎవరూ నీతో చెప్పిందీ?

మా—వాళ్ళ దాసీమనిషండి.

చం—ఏమనీ? ప్రతీ అక్షరం సరిగ్గా చెప్పాలి నువ్వు.

మా—మా—అ—మ్మగారు మీ—అ—య్యగారితో అ—ర్జెంటుగా మాట్లాడాలిట, ర—మ్మంటున్నారు—అని.

చం—ఎక్కడికి! ఇంటికా? ఇంటికైతే ఎల్లా కుదురుతుందీ? ఆ అమ్మాయి పోషకుడు—నిక్కాగ్ర—ఉంటాడుగా, ముసుముసులాగ!

మా—అబ్బే, వనంలోకండి, ఇంటికి కాదుట.

చం—ఎన్నింటికి? (జ్ఞాపకం తెచ్చుకొని) అయిదింటి కని కాదూ అన్నావు?

మా—అవునండి...(మొహంకేసి నిదానించి) సరే గానండి, తమరి మెడలో ఆ రకం పట్టీముడి ఏమీ సొగసుగా లేదండి.

చం—రకమా? రకం ఇప్పట్లో మార్చడానికి వీల్లేదు. త్వరగా సర్దు పచ్చి.

మా—చిత్తం.

చం—త్వరగా తెముల్చు. నిన్న రాత్రిరి నాటకంలో పీటముడిలాగ చెయ్యక!

మా—ఏమండి నిన్న నాటకాని కెళ్లారా?

చం—మరే. ఎంతో ముచ్చటపడి మరీ వెళ్లాను. అయితేం ఏనాడో పాపం చేసుకున్నాను, ఫలం అనుభవించాను. అదంతా సవాలక్ష గ్రంథం ఉంది. చెప్దామంటే, వాడిమీద మాచెడ్డ కోపం వస్తోంది. (అని మాలోకంమీద కోప్పడతాడు)

మా—(చిరునవ్వుతో) అయితే, బాబుగారూ, చెప్పండి చెప్పండి! ఇంతలో ఈ ముడి అయిపోతుంది.

చం—ఆడబోయే నాటకం అద్భుతంగా ఉంటుంది, మళ్ళీ అల్లాంటి నటసమ్మేళనం ఉండబోదు అంటూ అంతా ప్రదర్శనాన్ని అద్భుతంగా ప్రారంభం మొదలెట్టారు. నేనూ వెళ్ళి చెవులు నిక్కపొడుచుకుని గంభీరంగా కూచున్నాను. నటులు మొదలు పెట్టారు. గోల తగ్గి నాటకశాల చీమ చిటుక్కుమంటే వినపడేట్టు అయింది. ఆకస్మికంగా, ప్రభులాగ వచ్చిపడ్డాడు వీరయ్య తెగ ఊగిసలాడుతూ! "ఏమయ్యా, నాకు ఒకకుర్చీ ఇల్లా తెండి, త్వరగా!" అంటూ ఏదో అథార్టీ! పోనీ కుది

మట్టంగా ఓ పక్కగా ఏడవకూడదనూ, రంగంమీదే కుర్చీ వేయించి, గోతులోవాళ్ళకి నటులు కనిపించకుండా దడికట్టినట్టు కూచున్నాడు. జనం ఇల్లా ఉమ్మేశారు. ఒక్కడూ కింద ఉమ్మెయ్యలేదు. ఇంకోడైతే సిగ్గుపడి చచ్చును. పీటయ్యకి గర్వాంకుడానూ! వాడల్లా కూర్చుని, నాజన్మాంతరంకొద్దీ, నన్ను చూశాడు. చూసి, పకిలించి "ఏమండోయ్, శ్రీనాథ! వచ్చారా కుశలమా? ఇల్లా వస్తారా, నేను అల్లారానా?" అంటూ నన్ను హెచ్చరించాడు. నాకు ఒళ్ళు భగ్గుమంది. ఈ వెధవాయికీ నాకూ పరిచయం అని జనం అనుకుంటారేమో అని భయం వేసింది. ......(ఆగి)—అబ్బ! నువ్వు ఈ ముడి వెయ్యడం అంటూ అవుతుందా, లేక నా జన్మ ఇహా నింతేనా?

మా—(తొందర చూపెట్టి) అబ్బ, ఉండండీ, ముడి లోపలికి తిరిగిందీ!...సరే, బాబుగారూ! (నవ్వు ముఖాంతో) ఆ పీటయ్యని అసలు మీరు ఎరుగుదురా?

చం—ఎరగను. అయితేం? వాడు రెండో మాటలోనే నన్ను నువ్వు నువ్వు అనడమూ, చవటప్రశ్నలు అడగడమూ మొదలెట్టాడు. వాడి గాత్రపు హోరులో నటులు మాట్లాడిన నాదపుసరుకు కొట్టుకుపోయింది. "నేను నాటకం చూడాలి" అని అర్థం యిచ్చే సంజ్ఞచేశాను, ధోరణి తగ్గిస్తాడేమో నాడని. వాడు, "బస్! నువ్విదివరకిది చూళ్లేదూ! నే చూశా! చాలా తమాషాగా ఉంటుందోయ్! అబ్బో! ఇదుగో!" అని అరుస్తూ ఆకథ యావత్తూ అంకరంగప్రకారం పాఠంలాగ చెబుతూ, యింకా ముందు రాగల భాగంలోని పద్యాలుకూడా ఝుమా

యించి పాడ్డం ప్రారంభించి, నాకు భరతవాక్యం వినే ప్రాప్తి లేదనిపించేటట్టు, నా భరతం పట్టాడు......

(కోపంగా) ఒరేయ్! యిప్పుడు నువ్వు పడుతున్నావ్ నా భరతం! ఆగు. నువ్విది వదలిపెట్టు. గొంతుక్కి ఉరిపోసుగున్నా యింతకంటె పెందరాళే అవుతుంది. వదులు!...... అబ్బ!...ఆ కోటు తుడు. బొత్తిగా పీటముడి వేసేస్తున్నావే!

మా—(తొందరపడి పక్కని పెట్టిన కోటుదగ్గిరికి పరిగెట్టి వస్తూ) బాబుగారండీ! అప్పుడు తమరుగారు ఏం జేశారు?

చం—ఆఁ. ఎంజేస్తానూ! మహాప్రభో అంటూ కళ్ళు మూసుగుని దణ్ణం పెట్టి, లేచి, లోపల తిట్టుగుంటూ, చచ్చి చెడి వీథులో పడ్డాను! వీథులోకి రాగానే, వాడు, "మా బండీమీదికి గావోయ్, దిక్కుమాలి మొహమాటం నువ్వూనూ! మా బండికేసి చూచి రాజైనవాడల్లా గుండె కొట్టుగోడమేనూ!" అన్నాడు.

"అల్లాకాదండి, క్షమించండి, నేను కొందర్ని ఆహ్వానించాను వాళ్లని కలుసుగోవాలి" అని, నేను నాలిక జారి అన్నాను.

"అయితే, ఇహ నేం? నేనూ నీకు స్నేహితుణ్ణి గనక నీతో వచ్చేస్తాను. నేనూ మరో సామంతు గృహానికి వెళ్లాలి గాని, ఆ సన్నాసివిందుకి వెళ్లడం మానేస్తాను" అన్నాడు.

"నేను దీనుణ్ణి. తమంతవారికి స్వాగతం ఇవ్వడానికి అనర్హుణ్ణి. తిండి పెట్టగల్ను గాని, నేను మేపలేను" అన్నాను.

"ఓయ్. వెర్రివాడా, నేను పట్టింపుమనిషినికానయ్యా! నువ్వు మాట్టాడితేనే నాకు కడుపు నిండుతోంది. నీమీద

ఒళ్ళొట్టిగుంటాను కావలిస్తే. నేను ఏమైనాసరే తింటాను. అసలు విందులు చేసిచేసి అజీర్తి చేసిచేసి తీసుకుంటున్నాను" అన్నాడు.

"మీరు ఆ సామంతు డింటికి వెళ్ళకపోతే ఆయన ఏమన్నా అనుకుంటే!" అన్నాను.

"వాడి మొహం, ఏంజేస్తాడూ! ఇంతమాత్రానికే! మా పరిచయం అంతటిదే అనుకున్నావా? పోనిలేస్తూ, నువ్వే ఎక్కువ నాయనా!" అన్నాడు.

...(తొందరా చీకాకూ పడి) సరేగాని, కోటీశ్వరా! వేళ దాటిపోయిందిరా, తెమలరా!

సా—(హాయిపిడిగా) చిత్రం చిత్రం. తెమలండి మీరే. అసలు వేళ దాటలేదండి. దాటినా ఆయన అక్కడే ఉంటారు.

చం—(సంతోషంగా) నీ కెట్లా తెలుసూ?

మా—ఎవరైనా అంతేనండీ? అయితే బాబుగారూ, నాకు తెలియక అడుగుతాను, ఆ పీటయ్యాసు ఎల్లా వాడుకుంటు గున్నారు?

చం—నిస్పృహలో పడిపోయి నుంచున్నాను. ఘట్టున ఓ పెద్ద బండి వచ్చింది. అందులోంచి ఎవరో దిగారు. "ఇంకేం! నాకోసమేనా ఏమిటి మీరొస్తా! వచ్చెవచ్చె!" అంటూ వాడెళ్ళాడు. ఆ దోసందులో నేను మెల్లిగా ఒసిలి ఇవతల పడ్డాను.

మా—ఇల్లాంటివి ఉంటూంటాయి, బాబుగారూ! అన్ని చోట్లా మనం అనుకున్నట్టు జరిగిపోతే, సౌఖ్యం ఎక్కువై పోయి, జబ్బుచేసి, ప్రాణం తీసేస్తుంది.

చం—ఏడిశావ్ లేస్తూ! కోటు తే! (తొడుక్కుంటూ) కనకాద్రి ఉన్నాడేం! వాడికిరా అనవసరమైన చాదస్తం! వాడి చాదస్తం కుదరదు. మనకి ఏమన్నప్పుడూ, మనం కోరనప్పుడూ తప్ప వాడు సాధారణంగా మాట్లాడడు. వనప్రియని తను పెంచాట్ట! అందుకని, ఆ అమ్మాయి పెళ్ళి తన యిష్ట ప్రకారం జరగాలిట! కాని, మనము వెళ్లాలి. ఆ అమ్మాయి వచ్చి వెళ్ళిపోతుందేమో గూడాను, ఈపాటికి!

మా—కాస్త ఇటూ అటూలోనే వెళ్ళిపోదార్లెండీ!

చం—వెళ్ళిపోదుగాని, నా భయం నాది. నావల్ల వచ్చే చిన్న తప్పుని కూడా పెద్దగా భావిస్తాను.

మా—యథార్థ ప్రేమలో పెద్దతప్పులు చిన్నవై పోతాయండి.

చం—అయితే, మాలోకం! అవిడకి నామీద యథార్థ ప్రేమ ఉందని నీ అభిప్రాయమేనా, నిజంగా!

మా—ఇంకా సందేహం ఏమిటండీ!

చం—ఏమో, నాకు భయమే. నా ప్రేమ హృదయపూర్వకం. ఇటువంటి ప్రేమ గలవాళ్ళకి అసంభవాలు ఇట్టేఇట్టే జరిగిపోవాలని కోరికలుంటాయి. చాలుగాని, ఇక వెళదాం పద. ఆవిడ సౌందర్యరాశి!

మా—మీకోటు సరిగ్గా లేదు.

చం—అయితేంలే.

మా—కొంచెం సర్దనీండి బాబూ! (అని సర్దబోతాడు)

చం—నాకు ఊపిరి సలపటంలేదు. అది అల్లాఉణ్ణే. ఎక్కడో చవటలాగ!

మా—(దువ్వెన్న తీసి) కాస్త మీ తల దువ్వనీండి. (అని దువ్వుతాడు)

చం—ఓరి వెకిలి సన్యాసీ! చెవి కోసుకుపోయిందిరా, నీచెవులు కత్తిరించా!

మా—మీ దుస్తులు...

చం—అక్కర్లేదు. ఆగు. చాలా శ్రమపడ్డావ్.

మా—చాలా నలిగిపోయి మడతలు పడ్డాయి.

చం—సరిగ్గా ఇల్లానే ఉండాలని నా ఉద్దేశం. ఇహేం జేస్తావ్?

మా—పోనీ, కాస్త టోపీయేనా దుమ్ము దులుపుతాను. అనుజ్ఞ ఇవ్వండి, బాబూగారూ!

చం—అల్లాయితే, ఏడవరా. త్వరగా కానీ.

మా—(తుడవకుండా) మీరు ఇది ఈ ఎల్లంగానే నెత్తి నెట్టుగుంటారా?

చం—(దీర్ఘాలు తీస్తూ) త్వరగా తెమలరా!

మా—తెమలకేముందీ, ఇంకా సలుసం, సిగ్గు సిగ్గు. (అని టోపీ తుడుస్తాడు)

చం—చాలు, ఇల్లా తే.

మా—క్షణం!

చం—నన్ను చంపేస్తున్నావురా, నీదుంపతెగా!

మా—ఇతంతా నొక్కులుకూడా పడింది. ఎక్కడేనా మీరారు దాక్కున్నారా ఏమిటి!

చం—నువ్వు ఆ టోపీ మరి నాకు ఇవ్వకుండా ఉంచేసుగుంటావా ఏమిటి?

మా—అబ్బ? అయిపోయిందండీ.

చం—(ఉసూరుమంటూ) అయితేమరి ఇయ్యి

మా—ఇదిగోనండి. (అని ఇవ్వబోతూ టోపీ కింద పడేస్తాడు) అయ్యో!

చం—అదుగో, బాడిలో పడేశావు! ఇదేనా నాకు సాయం! దిక్కుమాలి ఘటం!

మా—కాస్త దులిపి ఇచ్చేస్తా నుండండీ! (అని మళ్లీ తీసుగోబోతాడు)

చం—ఛీ. ఉండు. నే నివ్వను. నువ్వు ఉంటేగాని నాకు పిల్లేనట్టు నీ నటన, పైకి అట్టహాసం! తీరా వచ్చేసరికి నువ్వే నన్ను పీక్కుతినడం. చంపెయ్యడం! ముందు ఇల్లాటివాళ్ళు విరగడవాలి.

[మాలోకం చాలా నొచ్చుగున్నట్టు నటించి, ఎడమ ఎదర ఎడమకేసి తిరిగి చాలా కోపంవచ్చిన వాడికిమల్లే కూచుంటాడు. చంద్రగిరి తను వెళ్లిపోడానికి కుడిఎదరకి నడుస్తాడు. అక్కడ ఆగి, మొదట నవ్వుమొహం పెట్టి, తరవాత కోపం మొహం పెట్టి—]

చం—ఒరేయ్, మాలోకం!

మా—(తిరక్కుండానే) నాకు కోపంగా ఉందండీ!

చం—నీకోపం తగలేసిరి, ఇల్లా రా, రా. చూదాం [illegible] ఆ అమ్మాయి!

మా—మీరు చూశారుగా.

చం—(కోపంగా) కాదురా, ఇల్లా రా! నువ్వు కూడా చూడు.

మా—(వచ్చి చూస్తాడు)

చం—అపిల్లే కాదూ! నన్ను చూసీకూడా కానట్టు ఇల్లా వెళ్ళిపోతుందేం? ఏమనుకో నిన్నాడు? నీ అభిప్రాయం ఏమిటి, మాలోకం? ఎందుకో మరోరకంగా ఉన్నానే!

మా—నేను మాట్లాడనండీ- నేను [illegible]! మీరింకా నాధోరణి వినుగుగా!

చం—నేను ఎంతో బాధలో ఉన్నప్పుడు నువ్వు నోరు మూసుగుని ఊరుకోడం మాత్రం నాకు విసుగుకాదూ! అందుకని చెప్పమ్మా, మాలోకం! అడిగానుగా! నీఊహ చెప్పు. నేను ఇప్పుడు ఏం అనుకోను? చెప్పవ్? నీభావం ఏమిటి? నీ అభిప్రాయం ఏమిటి? నీతాత్పర్యం ఏమిటి?

మా—నేను ఊరుకోడమే మంచిదండీ. తగుదునమ్మా అంటూ ప్రతీదాల్లోనూ పూసుగుని రావడం నాకు కిట్టదు.

చం—ఓరి నీకోపం కొరివెట్టా, వెళ్లిరారా! వెనకాలే పోంచి వెళ్లరా! కనిపెట్టిరారా!

మా—చిత్తం. (అని కుడియెదర్నించి వెళ్లి అప్పుడే ఖాళీ వచ్చి) కొంత కొంత వెనకాలే వెళ్ళనాండి?

చం—అవును.

మా—చిత్తం. (అని వెళ్లి మళ్లీ వచ్చి) వాళ్లు నన్ను కనిపెట్టకుండా అన్నమాటేనా అండి? అనగా నన్ను మీరు పంపినట్టుగా పైకి కించిత్తూ తెలియకుండానేనా?

చం—కాదుకాదు. నన్ను ఫలానావారు పంపించారంటూ సాటింపువేసి వాళ్లకు నోటీసు జారీచెయ్యి! (పళ్లు బిగించి) చవటన్నర!

మా—చిత్తం. (అని వెళ్ళి మళ్ళీ వచ్చి) మీరు ఇక్కడే ఉంటారా అండి?

చం—ఓరి నీ తాడు తెగా, అందరికంటె నీ సోదిమరీ జాస్తీ అయిందేమిరా! నాకర్మం! (అని తల పట్టుకుని కూర్చుంటాడు. మాలోకం కుడి ఎదరికి పరిగెట్టి పోతాడు)

—అబ్బ! నిమిషంలో వెళ్ళడం, రెండునిమిషాల్లో మాట్టాడేసెయ్యడం, మూణ్ణిమిషాల్లో పెళ్ళి చేసేసుగోడం అనుకున్నాను. కథ ఎల్లా వచ్చిందీ! ఔరా! ఈనాఖరుకుంక ఎంతసేపటికి వస్తాడో! నేనే వెళ్ళాలో! ఆకనకాద్రి ఓడూ! లోగడే వాడు ఆపిల్లకి మరో సంబంధం ఏదైనా రైటు చెయ్య లేదుకదా అని నాకు మరో దిగులు పట్టుగుంది.

(కుడిమధ్యనుంచి పాటయ్య వస్తాడు)

పా—ఏమండోయ్, మహాశయా!

చం—ఎవరది?

పా—నేనేనండి. నాపేరు పాటయ్య. చాల దూరాన్నించే

అనుకుంటూ వచ్చాను. తమర్ని చూడగానే తమ రున్నారని సంభరపడ్డాను. తమరే అని పోల్చుకున్నాను. అసలు నేను దిక్కులు చూడకుండా సూటిగా ఇక్కడికే వచ్చాను. ఇక మీరు నాకు పరమ స్నేహితులు. ఈమధ్య నేను ఓ కొత్త రాగంమీద ఓ భణితి, న్యాయంగా ఒఖ్ఖ్షణి, కనిపెట్టాను. ఉద్ధండులు పుల్లాంటి ఆస్థాన గాయకులంతా నా భణితి విని కొట్టుగుని, బాదుకుని రాగాలు పెడుతున్నారు. నా యెంగిలి భణితి ప్రకారం అప్పుడే ఓ పాతికమంది కీర్తనలు కూడా రాసేశారు.

చం—(చికాకుపడి, తల పట్టుగుని, ఉసూరుమని, ఆశ్చర్యపోతాడు.)

పా—అయ్యా! (అని సకిలించి) నేనూ ఇంత కలవాణ్ణి మీ దయవల్ల. మరి దేవుడు చాలా మేలుచేస్తే, నాద సామాన్యపు పుట్టుక కాదు. కొద్దో గొప్పో నాకూ ఉద్యోగం! మొట్టమొదట దేశంలో మాంచి లెఖ్ఖల్లోవాణ్ణి. కాని, ఇవన్నీ ఒక యెత్తూ, నేను కనిపెట్టిన ఆ కొత్త భణితి ఉందే—ఇందాకా చెప్పాను!—అది ఒక యెత్తూనూ! ఇదిగో, మీ అనుజ్ఞ చొప్పున అది ఒఖ్ఖరవ్వ పాడి వినిపిస్తా!

(అని కూచుని, ఓపొట్లం తీసి, రెండు మిరియాలూ, కాస్త పటికిబెల్లమూ, నోట్లో వేసుకుని) కాస్తంత శ్రుతి వేసుగోడానికి మీయింట ఏమీ లేదుకద! పోసి లెండి. శ్రుతిలో ఏముంది! ...స్సా, పా, సా, పా, స్సా...ఇది త్రిస్థాయి!...తమరు ప్రాణ పదంగా వినిపించుగోవాలి, ఏమనుకున్నారో! మీ పాద

పద్యాలకి నమస్కారం !

"నాగానమూ—మరిగానమే" (అనే ముక్కలు పాడి) ఇది ఎంత బాగుందో తమరే అనాలి, నేనే వినాలి. చాలా బాగుండలా ?

చం—హా, దైవమా! నాకు ఎటువంటి బాధలు కల్పించావయ్యా ! అయితే, ఏమోయ్, నువ్వు ఆపుతావా ఆపవా ఈధోరణి !

పా—తమరన్నట్టు, ఈధోరణి ప్రవాహంలాంటిది. ఈ చివర ఎన్ని సంగతులు పెట్టా ననుకున్నారు, మంచి రకంవి? ముక్కలు అవే అయినా, అవి మరొక్కసారి, ఇంకొక్కమారు, వేరొక్కతూరి అనడంలో మరో తమాషా, మరో మజాకా, మరో ఖుషీ కనపరచాలిగాని, కేవలం శుద్ధ గుణకారం చేసినట్టు ఉండకూడదు. వినండి. (అని నాలుగైదుసార్లు చివర భాగం పాడి, సంగతులు పిరాయిస్తాడు) ఏమండీ, ప్రమాణికంగా చెప్పండి, బాగుండ లేదూ ?

చం—బాగుండక పోడం కూడానా ! నిక్షేపంలా ఉంది. నా అవస్థ ఎల్లా ఉందో...

పా—ఇక, ఈపాతే, మంచి తన్మయత్వంలో గంతు వేస్తూ పాడుకోడానికి సదుపాయాలన్నీ చూసి, మరీ వేశాను. ఇదిగో గమనించండి. (అని అతడు ఒక శరీరస్థితి చూపెట్టి, ఆడి, పాడి, మాట్లాడి, రెండు రకాల గంతులు వేసి) ఈగంతు ఎల్లా ఉంది?

చం—దివ్యంగా ఉంది.

పా—నాట్యాలు చేసేవాళ్ళందర్లోనూ నాదే పైచెయ్యి అని నాఉద్దేశం! (అని, చెయ్యిపైకి పెడతాడు)

చం—అల్లానే ఉంది. పై చెయ్యీ, కాలూగుడానూ!

పా—నా గాత్రం?

చం—పోత పోయించినట్టుంది.

పా—నా అభినయం?

చ—ఓ తరనాయి లేకుండా ఉంది.

పా—కొంచెం మీరు నాదగ్గిర నేర్చుకోండి, పోనీ! ఏమీ ఇవ్వక్కర్లెండి! స్నేహభావంలో నేను దమ్మిడీ ఫీజు పుచ్చుకోకుండానే పనిచేస్తాను.

చం—చిత్తం. కాని, ఉన్నది ఉన్నట్టు చెప్పవలిస్తే, ప్రస్తుతం ఒక చిన్న విషయం గురించి నేను ఆతుర్దాగా ఉన్నాను.

పా—ఓయి తెలివితక్కువవాడా, అటువంటి ఆతుర్దాలు పోగొట్టడానికేనయ్యా, ఈనాట్యం లాంటివి పుడతా? పట్టండి, కానీయండి, ఎగరండి!

చం—మరోమాటు చూద్దాం లెండి పోనీ!

పా—గానంయొక్క వ్యాపారం తక్షణ వ్యాపారం అండీ, ఇందులో మళ్ళీ మళ్ళీలు లేవు. ఇదిగో నేర్చుగోండి. ఊఁ. (అని తన గొంతికతో శ్రుతి వేస్తాడు.)

చం—(వికృత మొహంతో—తనలో) నాకు పీడెక్కడ పోగయాడు, ఎల్లా వొదుల్తాడు!

పా—మీరు కొంచెం బాధ పడుతున్నట్టున్నారు, గానం

మీాకు వస్తుందో రాదో అని. నాది పూచీ, బెంగపెట్టుకోకండి! ఇంతమాత్రానికేనా! మీారింకాముందే అధైర్యపడుతున్నారే! నా భణితి ప్రకారం రాసిన కీర్తనల ప్రతులు నాతో పట్రాలేను. లేకపోతే ఈపాటికే మీాకు పాట వచ్చి పోయేది. ఆటకూడా చాలాభాగం నలిగిపోయేది.

చం—నాకన్నా ఇల్లా ఉన్నప్పుడు ఎన్నైనా వస్తాయి!

(ఇండి ఎవర్ని చూచి మాలోకం నవ్వుతాడు. వాణ్ని చూడగానే పాటయ్య నవ్వుతాడు. మాలోకం కూడా నవ్వుతాడు.)

పా—(మాలోకంతో) పోనీ నువ్వూ నేర్చుకో! రా! నాసొమ్ము ఎంతమంది తిన్నారుకారు!

మా—(చంద్రగిరితో) అయ్యగారండి, నేనండీ, వెళ్ళి వచ్చానండి,

చం—ఏడిశావ్! ఆమాట చెప్పడం ఎందుకూ! నువ్వు వచ్చినట్టు నాకు తెలియడం లేదనా? ఇక ఊరుకో!

మా—ఇక్కడికండి, ఆపిడా...

చం—నిన్ను నోరు మూసుకోమన్నాను, తెలిసిందా! (అని, తలపట్టుకుని, కళ్లు మూసుకుని, ఆలోచించి, ముఖవైఖరి మార్చి, సంతోషం కనపరచి—)

ఒరేయ్, ముందు నువ్వు (అని పాటయ్యని చూపించి) ఈమహానుభావుణ్ణి నీవెంట తీసికెళ్ళి, తిన్నగా కనకాద్రిగారి ఇల్లు చూపెట్టి, రా! ఈయన అఖండుడు. ఈయన మహత్తు ఆ కనకాద్రిగారు కనిపెట్టాలిగాని, నాబోటిగాళ్లవల్ల కాదు.

(అని కంటితో సంజ్ఞ చేస్తాడు)

మా—రండి బాబూ, వెళదాం.

(కుడిఎదరకి, ముందు పాటయ్యా, తరవాత మాలోకమూ వెడతారు)

చం—(అటుచూసి) ఒరేయ్, మాలోకం, పాట! ఆ అమ్మాయీ...

మా—(వెనక్కి వచ్చి) ఏమిటండీ?

పా—(కూడా వెనక్కి వచ్చి తాళం వేసుకుంటూ, మూలుగుతూ, కుర్చీలో కూర్చుంటాడు)

చం—(తనలో) వీణ్ణి తగలెయ్యా! వీడు మళ్లీ వచ్చాడే శని లాగ! నన్ను వాడితో కాస్త రహస్యం మాట్లాడుకోనియ్యడే! (పైకి) సరేరా! ఏదో అనుకున్నాను. ఇట్టే మరచి పోయాను. ఈయనకి చాలా ఆయాసంగా ఉన్నట్టుంది. పదిలంగా తీసికెళ్లు.

(పాటయ్యా, మాలోకమూ కుడిఎదరికి పోతారు.)

చం—(బుగ్గలు పూరించి గాలి వొదిలి, గుండెలమీద చెయ్యి వేసుగుని) అమ్మయ్య! వీడిపాట సంతకెళ్లా! చంపేశాడు, వీడి చాదస్తం మాసిపోనూ! చచ్చే ఎత్తు వచ్చింది వీళ్ళతో, ఎల్లాగో గాని!

(అని వెళ్ళి కుర్చీలో కూచుంటాడు. కుడి ఎదర్నించి మధుప్రియ వచ్చి, ఎవరూ లేరుకదా అన్నట్లు దిక్కులు చూసి, వెళ్ళి మాట్లాడ్డానికా అన్నట్టు ప్రయత్నిస్తుంది. కుడిమధ్యనించి ఆటయ్య వచ్చి, విచారంతో ఆవిడికి అడ్డం వెళ్ళి)

ఆ—(ఏడ్చి, ఆగి) అమ్మా! మీరు ఒకమాట వినిపించు గోవాలి. అడ్డమైనవాడూ వచ్చి స్వంతసోదీ వేసి, పీర్చి బాధిస్తున్నాడు. నాకు ఈయనతో అర్జెంటు వ్యవహారం ఉండడంవల్ల ఇందాకణ్ణించి పిల్లేక గోళ్లు గిల్లుకుంటూ నేను ఆ చాటున కూచున్నాను. ఇప్పుడే ఈయనకి కొంచెం తెరిపి అయింది. (విచారంగా) సోదరీమణులకి కేవలం హృదయభేదనంగా ఉండే అతివిషాద ప్రసంగం ఒకటి నేను ఈయనతో జరపాలి. కాబట్టి మాజోలి మీరు కలగజేసు కోకుండా నిష్క్రమించవలసిందని నా సవినయమైన ప్రార్థన.

వన—(వచ్చినదార్నే వెళ్ళిపోతూ, తీవ్రంగా చూస్తుంది)

చం—(ముందు, వనప్రితు వచ్చినందుకు సంతోషించినా, ఆవిడ వెళ్ళగొట్టబడినందుకు చికాకుపడతాడు. కొత్తవాణ్ణి, ఏమీ అనలేకపోతాడు)

(కొత్తవాడింకా తనదగ్గిరికి రాకుండానే—తనలో) పీడు ఏడుపుగుడా మొదలెడతాడు గావును! ఎన్నిందాల వచ్చిం దండీ, నా పెళ్ళిమాటలకీ !

ఆ—(గొల్లుమని) తమవంటివారు కొంచెం సమదాయిస్తే గాని, నేను బతకనండీ!

చం—మీ రెవరు ?

ఆ—ఓ గొప్పవాణ్ణి.

చం—పేరు ?

ఆ—నా పేరు ఆటయ్యండి. నిన్న నండి, భామయ్యా,

నేనూ పేకాట వేశానండి. (ఏడుపు ముఖంతో) నన్ను వాడు నెగ్గేశాడండీ, ఉత్తపుణ్యానికి!

చం—ఆగాగు. తిన్నగా చెప్పు.

ఆ—(ఆగి) అప్పట్లోగనక కలుపు వాడిచే అయి ఉంటే, నేను చెప్పి మరీ నెగ్గేవాణ్ణి. (కుళ్ళుతూ) నాకు కొండంత ఆపత్తు వచ్చిపడ్డోవ్! నేను ఇక తేటుకోనూ! (ఆగి) నిన్నటితోటి నూ చెడ్డ నిరక్తి పుట్టి, పేకాటవాళ్ళందర్నీ ఏ చీకట్లోనో నూయంచేసేసి, తరవాత తిన్నగా ఏ సంత మార్కెట్టువంటి చోటికో వెళ్ళి నేను స్వగతంగా (కోపం కనపరుస్తూ) పొడిచేసుకుందామా అన్నంత కోపం వచ్చింది. (ఏడుస్తూ) అసలు మీ లెరుగాసు గాని, నాకు ఒక్క పట్టు వస్తే చాలు! (తాపీగా) భామయ్య ఉద్దేశం ఎంత దురుద్దేశమో చిత్తగించారూ! నాకు ఒక పట్టైనా అంక నియ్యకుండా అన్నిపట్లూ తనే లాగి, కోటుచేసెయ్యాలనీ!... సరే నేను కలిపాను, వేశాను.

చం—సరే సరే. ఏదో వోటయింది. ఇప్పు డెందుకు అద్దంతా?

ఆ—ఎందుకేమిటీ, చిత్రం చూడండి. నేనూ ఇల్లా ముక్కలు పంచగానే, నా పెద్దమ్మవారు నా నెత్తి ఎక్కింది. ఏమంటారా! వాడు డైమను ఆసుతోసహా ఏడు ముక్కలు వరసని పంచాడు. నేను తెల్లపోయినా, మన దగ్గర రెండాసు లున్నాయికదా, వీడు కోటు ఎల్లా చేస్తాడులే అని ధైర్యం

తెచ్చుకున్నాను. వెంటనే వాడు నాలుగు ఇస్పేట్లు కొట్టాడు.

చం—అబ్బబ్బా, సరేనయ్యా! నువ్వు ఏదో వోటి వేసి ఉంటావు.

ఆ—ఏడిసినట్లే ఉంది. అది చెప్పడానికే నే నచ్చింది. వాడు ఆ ఆఖరు ఇస్పేటుముక్క దిగగానే నాకు గొప్ప సందిగ్ధావస్థ వచ్చింది. నా చేతులో ఉన్న అరఖుకళావ రాసుల్లో ఏది పారెయ్యనా అని. ఏది పారేస్తే ఏం చిక్కో! దేవుడున్నాడులే అని చెప్పేసి నేను అఖుఆసు కింద పారే శాను. తీరా వాడు ఆఖరుముక్క దిగడం చూస్తును గదా అది వాణ్ణి తగలెయ్యా, (ఏడుస్తూ) అరఖుముక్క! నాకేం తెలుసూ, వాడు కళావరు నిరంగుగా తీసేసుకున్నాడు. నాకు మాట పోయింది. పెఘవ జన్మ అనిపించింది. ఇంత దురదృష్టం నాకు రావచ్చునా చెప్పండి! నాబాధ మీ రక్కడ చూస్తే, మీరీ పాటికి ఏమయ్యేవారో!

చం—(అతిదీనంగా తల ఊగిస్తూ) నిజమే. అదృష్ట దురదృష్టాలు ఆచరణరంగంలోకి దిగిన వ్యక్తికి గాని బోధ పడవు.

ఆ—(చికాకుగా) అది కాదయ్యా? నావల్ల తప్పే మిటో శాస్త్ర తీర్పు సెలవిస్తావేమో అని నిన్ను వెతుక్కుంటూ వస్తినిగదా, అల్లా ఉసూరుమని పోతావేం! నే నిప్పుడు కోపం తెచ్చుగోడానికి ఆస్కారం ఉందంటావా

లేదంటావా? (అని కళ్ళు ఎఱ్ఱజేసి) ఇవిగో రెండొందల లింకా నా జేబులోనే ఉన్నాయి!

చం—చిత్తం. మీ తప్పు లేదు. మీ సంగతి నాకు బోధ పడింది గనక మీ దస్తరం కట్టెయ్యండి. మీ కోపమూ మంచిదే. కానీండి. ఇక్కడ వద్దు. నాకు మిక్కిలి తలతుంచుగుపోయే పనుంది.

ఆ—అల్లాంటి పని జరక్కుండా నే ప్రాణం ధారపోస్తాను.

చం—వద్దు వద్దు. మీకెందు కాశ్రమా! నే వెళ్లాలి, సెలవు! మీ రెక్కడేనా నిలకడగా కూచుని మీ దుర్దశ గురించి విచారించి, చింతించి, ఏడవండి.

ఆ—(కుసిల్లుతూ) పుట్టైను దుఃఖంలో ఉండి వస్తిరి గదా...

చం—(తనలో) వీడూ వదలడు. (అని ఆగి, ఒక లిప్త నిదానించి, నవ్వుమొహం పెట్టి) అయితే ఆటయ్యగారూ! ఒకపని చెయ్యండి. ఇదిపట్టిగెళ్ళి ఒకకొత్తపేక కొనుక్కురండి మీ దుఃఖం అంతరించేవరకూ పేకాడ్డానికి వీలైన చోటికి వెళ్లచ్చునూ!

(అని జేబులోంచి తీసి ఒక నాణెం ఇస్తాడు. ఆటయ్య అది పుచ్చుకుని ఎడమ ఎదర్నించి నిష్క్రమించ బోతూ మళ్ళీ వెనక్కి రాబోతాడు. చంద్రగిరి అతడికి నమస్కరించి, వెళ్లి రమ్మని సంజ్ఞచేసి, కుర్చీలో కూలబడతాడు.)

ఆ—సరే. కొత్తపేక అచ్చిరావచ్చు. ఈ మాటలు అరఖాసే అట్టే పెడతా! (అని వెళ్ళిపోతాడు)

చం—అమ్మ వీణ్ణి పొడిచెయ్యా! ఇల్లాపట్టుకున్నాడేం, భల్లూకంలాగ, వెధవ ఏకుపూ వీడూనూ! నా పెళ్ళిమాటల గురించికూడా అన్నీ విన్నాడులే! నే నిక్కడ ఉంటే నాపని ఇంతే! నేను చటుక్కున వనంలోకి పరిగెట్టడమే కర్తవ్యం. పోనీ, త్వరగా ఈ మూలోకం కుంక వచ్చిపడకూడదూ! వాడో బురద కట్టె! వాడిచేత కబురంపించి, వనప్రియని అక్కడికే రమ్మని కోరతాను. శాస్త్రం చెప్పిన ట్టొచ్చింది, గోష!

(అని తొందరగా ఎడమమధ్యనించి పోతాడు)

## రంగం—2

[చంద్రగిరి ఒక ప్రమదావనంలో ఉంటాడు. కుడిఎడరకి ఎడంగా చతికిలబడినట్టు కనిపించాలి. కప్పిన సోఫా రంగం మీాద ఉంటుంది.]

చం—ఇంటిదగ్గిర బయల్దేరి ముసుగేసుగుని ఎవడూ నన్ను పోల్చుగోకుండా గబగబా ఇక్కడికి వచ్చిపడ్డాను. నన్ను మరీ పట్టుగున్నారు, ఇదేముటో గాని! పోనీ, వాళ్లు పరాయి వాళ్లు. ఈ మూలోకానికి మరీ వచ్చింది! నే నిక్కడికి వచ్చినట్టు ఆ అమ్మాయితో చెప్పి వీణ్ని త్వరగా ఇక్కడికి రమ్మన్నాను. తెమిలి రాడే! వచ్చి, ఈ వనంలో దారిదగ్గిర కాసి, నా దగ్గిరికి మళ్లీ మరోడు వచ్చిపడకుండా కట్టుదిట్టం

చెయ్యమన్నాను. ఇందాకా బాగా మచ్చేసింది. రెండు దిక్కులు దర్శించినా తీరిపోను! ఈ పోకిరాయుళ్ళు ఎక్కడివాళ్ళక్కడ చెల్లాచెదరై పోయుండే వాళ్ళు...ఎంత నేను చూసినా కళ్ళు చిల్లులుపడడమే గాని, మూలోకం మాత్రం రాదు! (అని కళ్ళు మూసుకొని, తల వంచుకొని ఉంటాడు)

మా—(కుడిముఖ్యలించి నగిసుస్తూ వచ్చి) అయ్యగారండి!

చం—(చూడకుండా) ఎంతసేపూ అయ్యా కొయ్యానూ! ఏవేళైంది నువ్వెళ్ళి?

మా—మరి నేను గబగబా వెళ్ళలేనండీ! కాళ్ళు పీకేశాయి.

చం—ఏడిశావు లేస్తూ చవటకాన్యా!...విశేషం ఏమన్నా ఉందా, ఖరాగా వచ్చేశావా?

మా—విశేషం ఉందండి. ఆ అమ్మాయిగారుఅన్నారూ...

చం—(ఇష్టంగా నవ్వుతూ లేవబోతూ) చెప్పరా, నీమచ్ఛ మాయా! చెప్పరా! దెయ్యంలాగ అల్లా కళ్ళప్పగించి తెల్ల పోతా వేంరా?

మా—(నానుస్తూ) చెప్పె ద్యమంటారా?

చం—(విసుగుతో) నీకు ఏళ్ళెళ్ళా వచ్చాయిరా, నీ పళ్ళు మండా! చెప్పినా ఏమిటీ, ఒక్ఖుగుక్కన కక్కేయ్!

మా—అబ్బ! ఒక్కక్షణం ఉండాలండీ, మీ పుణ్యమాయె. నేను ధౌడు తీసేసరికి నాకు ప్రాణం చాలొచ్చింది.

చం—(పళ్ళు బిగించి) నన్ను అడకత్తెరలో పెడితే నీకేం ఒలుకుతుందిరా, నీ మొహం ఈడ్వా!

మా—అయితే సరేనండీ. నేను ఆవిణ్ణి చూడడానికి, ఏక పరుగున, ఎంతో దూరం, ఎంతో జాగ్రత్తగా...

చం—(ఇంకా కోపంగా). నీడొంకతిరుగుళ్లు అంటించిరి గదరా!... (బిక్కమొహంతో) నన్ను చంపుతావురా!...

మా—కాస్తంత శాంతించండి బాబూ! అందుకనే, పెద్దలు ...

చం—ఆ. పెద్దలు నీనోట పడి చచ్చి బూడిదయారు. ఎంచేతంటే, నాకు కావలసింది నువ్వు చెప్పకుండా నీనోరు పూడ్చారు. అనరా, అనరా, ఆ అమ్మాయి ఏమందీ ?

మా— మీప్రియురాలు, మీ బహిఃప్రాణం, మీ వనప్రియ గారు మీకు పరమానందం కలిగించే ఉద్దేశంతో ... (అని దీక్షగా చూపు నిల్పి, నోరు తెరిచి, అతని జుట్టుకేసి చూసి, ఏదో గుర్తించుతూన్నట్టు నటించి) అయ్యగారండి, మీనెత్తి మీద ఏదో పురుగు ఉందండి!

చం—(నిర్లక్ష్యంగా) అయితేంలే, చెప్పు!

మా—(సకిలించి) ఆవిడ, ఏమందంటే...

చం—ఊఁ. ఏమందీ ?

మా—(చిరునవ్వుతో) అయ్యగారండి! ఆవిడ ఏమి అన్నారో అది మీరు చెప్పుకోగలిగేవేమో చెప్పండి చూద్దాం!

చం—(తీవ్రంగా) ఒరేయి! నేను వేళాకోళం ఇక భరించ లేనని తెలుసా?

మా—తెలుసునండీ! ఏందుకండీ అంతకోపం! ఆవిడ

ఇక్కడికి ఇప్పుడే వస్తాం అన్నారండీ! మంచి మాట చెప్పు గొచ్చినా అంత ఆగ్రహం చేసేరండీ? (అని మూర్తి ముసిముసిన గుంటాడు)

చం—అమ్మయ్యా! అల్లా చెప్పు మరి! సరే, నువ్వు కాస్సేపు అసింటా కూచో ఓమూల! నేనొక్కణ్ణీ విడిగా ఆలోచించు గోవాలి.

మా—ఈ వేపునాండీ, ఆ వేపునా?

చం—(కుడిఎదర చూపించి) అక్కడ!

(అప్పుడు ఆటయ్య పాత పేక తప్పతప్పున కలుపుతూ, కొత్త పేక నోటితో పట్టుగుని ఎడమ ఎదర్నించి వస్తాడు.)

ఓహోహో! వీరా! ఒరేయ్, ఓపని చెయ్యి. పేకా టేశ్వరుడైన ఈ కోటేశ్వర్ణి జాయిగా నడిపించిగెళ్ళి సోదే శ్వరుడైన కనకాద్రిగారికి అప్పగించిరా!

మా—చిత్తం. (అని ఆటయ్యకి సంజ్ఞ చేస్తాడు. మాలోకమూ, ఆటయ్యా కుడిఎదరినించి నిష్క్రమిస్తారు).

చం—అమ్మయ్య! (అని సోఫాలో కూచ్చుంటాడు)

(కుడిఎదర్నించి దమనం, మరువం వస్తారు. చంద్రగిరి ఆశ్చర్యమూ, నిస్పృహా కనపరిచి, పొద వెనక్కి వాలేస్తాడు)

ద—ఓసి, మరువం! నీది పిచ్చివాదన. అట్టే వాదించకు.

మ—ఓసి, దమనం! నీదే మూర్ఖవాదన. అట్టే వేషా లెయ్యకు.

ద—ఎవర్ని అడిగిచూసినా సరే, నాపక్షమే రైటంటారు.

మ——సరే. గెలవడం అంటే మొండివాదన చెయ్యడమా?

ద——నా కనుగుణంగా లక్షప్రమాణాలు లున్నాయి.

మ——అల్లాయితే, నాకు కోటిదాఖలా లున్నాయి. విని తీర్పు చెప్పేవాళ్ళుంటే!

ద——(వెనక్కి తిరిగి చంద్రగిరిని చూసి) ఇదుగో!! చంద్రగిరిగారు. ఈయన ఇటువంటి వ్యాపారాల్లో తెలివితక్కువవాడు కాడు. మన తగూ పరిష్కారం చెయ్యడానికి తగ్గ మేధావి. ఏమండోయ్, అయ్యా! మాకు ఓ వట్టిం పొచ్చింది, కాస్త మీరు తీర్చిపెట్టాలి. పట్టింపు ఏమిటి, అంటారేమో——"ప్రేమించేవాళ్ళల్లో పరమోత్తముడు ఎవడు?" అని.

చం——(నిట్టూర్పు విడిచి) అది చాలా గట్టి ప్రశ్న. మీరు తగు సమర్థుల్ని అడగడం మంచిది.

ద——ఛా, అదేమిటండోయ్, మీరు ఏదో లేని పోని వినయం లేవదీస్తున్నారే! సెబాసు! మీ అఖండ తెలివీ, మీనూత్న బుద్ధీ మేం ఎరుగుదుం! ప్రతివాడి నోటంటా...

చం——క్షమించాలి.

ద——ఊరుకోండీ, ఏమ్మాటలవీ! రావే మరువం, కూచో! (అని సోఫాలో అతనికి చెరోపక్కనీ కూచుంటారు. చంద్రగిరి లేచి నుంచోబోతాడు. అతణ్ణి చెరోరెక్కా పట్టుగుని వాళ్లు మళ్ళీ కూచోబెట్టేం తరవాత) మీరు తీర్పు చెప్పితీరాలండీ! మీవంటి వాళ్ళకి ఎంతసేపూ, రెండు నిముషాలూ!

చం——(తనలో) సమయానుకూలంగా ఏదైనా పన్నగలిగిన

భర్తలోనైనా అయోమయం కాదు గదా మాలోకం గాదూ! ఎక్కడికక్కడికే. వాదం లేకపోవడం నష్టం, అనుబంధాలు ఆట్టే ఉండవ్!

ద—ఊరుకుంటారా, చెప్పండీ!

చం—ఏం చెప్పనూ?

ద—ప్రేమించేవాడికి అనుమానం ఉండచ్చా, కూడదా అనేదానికి తీర్పు—మీరు చెప్పవలసింది.

మ—అది కాదండీ. అసలు సమస్య నేను ఒలిచినట్టు చెబుతాను కాస్కోండీ. భార్యని గురించిన అనుమానం ఎంతమాత్రం లేనివాడు గొప్ప ప్రేమవంతుడా, పెళ్ళాం ఏంజేసినా ప్రతినిత్యమూ అనుమాన పడేవాడు గొప్ప ప్రేమవంతుడా! ఇదండి మా తగాదా.

ద—అనుమానం కూడదని నామతం అండి.

మ—అనుమానం ఉంటూన్నప్పుడే గొప్పప్రేమ అని నాపక్షం అండి.

ద—తన స్త్రీని పూర్ణంగా విశ్వసించి మన్ననచేసే ప్రియుణ్ణి మనం గొప్ప చెయ్యొద్దండీ?

మ—తన స్త్రీమీద ఈగేనా వాలకుండా యావజ్జీవమూ కాపలా కాసుకునే ప్రియుణ్ణి మనం నెత్తిమీద పెట్టుకోవద్దండీ?

ద—ప్రేమకి ఫలం విశ్వాసంకాని, అవిశ్వాసం కాదండీ.

మ—విశేషమైన ఉద్రేకంతో అనుమానం కలిగి ఉండడమే ప్రేమకి నిజమైన దాఖలా అని నేనంటానండీ.

ద—చాల్చాలు. ఉద్రేకమే ప్రేమ అయితే, వృథాను మానాలతో నరుక్కునే ప్రియు లున్నారు.

మ—సంతోషించాంలే, ఉద్రేక రాహిత్యమే ప్రేమఅయితే, తెలిసి ఇతరులకి దోహదం చేసిపెట్టే ప్రియులున్నారు,

(ఎడం ఎదరికి వనప్రియ వచ్చి చంద్రగిరికి ఎడా పెడా స్త్రీలు ఉండడం గమనించి, చురుక్కునచూసి, పక్కని నక్కుతుంది.)

ద—అయ్యా, ఇప్పుడు తమరు సెలవివ్వండి.

మ—ఇప్పుడు తమరు చెప్పండి.

చం—తీర్పు చెప్పందే తమరు వెళ్ళా అంటున్నారు. ఉభయుల పక్షాలూ గట్టివే. మీరు చెప్పింది నేను కాదనలేను. ఇదిగో నాతీర్పు వినండి.

అనుమానం లేనివాడి ప్రేమ అత్యుత్తమప్రేమ.

అనుమానంతో కూడినవాడి ప్రేమ అత్యధిక ప్రేమ.

మ—ఓహో! చాలా గొప్ప తీర్పు కాని...

చం—మరేమీ వద్దు. అడిగారు, మనివి చేసుగున్నాను. వెళ్ళండి, కాదు నేను వెడతాను, మీరు కావలిస్తే ఉండండి.

(దమనక, మరువం కూడి యొకర్నించి నిష్క్రమించగా, ఎడమ యొపర్నించి వనప్రియ వస్తుంది)

ఓహో! ఇదుగో వనప్రియ! ఔను! ఎంతసేపైంది వచ్చి! ఎంత ఆలస్యం చేశావు? అయినాసరే, వచ్చినందుకు చాలా సంతోషం!

వన—మరే పాపం. అంత సంతోషంగా ఉండే మీ సంభాషణ

ఆపు చెయ్యడానికి నే నొచ్చినట్టున్నాను, పానకంలో పుడకలాగ! నేను మరీ ఆలస్యంగా వచ్చానంటూ నన్ను శాసించడంగూడా ఎందుకూ? (సహాసం, మదనం వెళ్ళిన దిశగా చూపిస్తూ) నేను రాకుండా ఉంటే మీకు సరి బాగుండేదేనేమో! నే పోతాను!

చం—కాదు కాదు కాదు, నువ్వు నామీద అనవసరంగా అనుమానపడకు. నాకు తిలకించిన పనిగురించి నన్ను నిందించకు. కాస్త జాలితల్చి, ఒక్క క్షణం ఆగు...

వన—క్షమించండి. నే వెడతాను. మీ స్నేహితులు మళ్ళీ దొరకరేమో, పరిగెట్టండి. (అని ఎడమ పక్కకి నిష్క్రమిస్తుంది)

చం—(ముక్కుమీద వేలుతో) ఔరా! ఎల్లా వస్తూంటుందో అనుమానం! లేనిపోని గొడవలు తెచ్చి, నానెత్తిని వేసి, నాకు అంతరాయం గలిగించడానికి స్త్రీపురుషులందరూ కూడబలుక్కున్నట్టు తోస్తుంది. నావల్ల తప్పేమీ లేనట్టు ఈ అమ్మాయికి తెలియాలి, ఈ అమ్మాయికోపం పోవాలి. వీళ్ళచేతే చెప్పిస్తే! ఈ డొంక కదిపితే, అసలు చెడుతుందేమో! ఏమైనా సరే, ఇక్కణ్ణించి లేచి, ఈమూలగా పోతాను. మళ్ళీ ఎవడూ కనపడడని నాధైర్యం! కనిపిస్తే నాపని యింతే.

(అని, లేచి, దిక్కులు చూసుగుంటూ, చిన్న చిన్న అడుగులు మెల్లిగా వేస్తూ, ఎడమ మూలగా నిష్క్రమించాలనే ఉద్దేశంతో అటు నడుస్తూండగా ఆ మూలనించి, మాటయ్య, చేతులో ఒక అర్జీ రాసిఉన్న కాగితం పట్టుగుని వస్తాడు.)

మా—అయ్యా! ఇది సమ స్వప్నంబో జేసమయంబో నేనెఱుగ. తామింతటికత సాధారణంబుగ సంచరించుచుంటిరి గాని, సతతంబును నిద్రలోనే యున్నట్లు తమ సౌఖ్యనాద్యములు చెప్పుచుందురు. మా పెద్దలు గావించు కొన్ని పూర్వపుణ్యావశేషంబునకుం ఫలముగ మీరిప్పుడు నాకు లభించితిరి.

చం—సరే సరే, నాతో ఏమన్నా పనుందా మీకు?

మా—చిత్తము. నున్నది, విధిప్రకారంబు యథాశక్తి నమస్కారంబు సల్పి; పదంపడి యుష్మ[illegible] పరిచయం బాధారంబు సేసికొని, సాహసము సహించి . .

చం—అంత యథాశాస్త్రీయంగా కాకుండా, వచ్చిన పని చెప్పండి.

మా—తమ జననముయొక్క ఔన్నత్యమును, తమ వాక్కుయొక్క చాతుర్యమును, తమ హృదయముయొక్క ఔదార్యమును నేను, స్వయముగ, సహస్ర ముఖముల వినియుంటి. మిమ్ముల౦ బొగడని మానవుడు లేడ!

చం—ఔను! నాకు పొగడ్తతో చాలా రాబడి ఉంది. వాస్తవమే. సరే ఇప్పుడు ఏం జెయ్యమని తమ సెలవు?

మా—తారొక్కటి గమనించుడీ! తాస అన్యులతోడం బరిచయంబు గావించికొనజూచు యత్నంబుదొడ్డ ఇక్కట్టు. ఉభయులకుం గూర్పువాడగు తృతీయుం డుండి జల్పించినగాని పదములు సార్థకములుగావు, ప్రజ్ఞలు సుబోధకములు గావును.

చం—(తనలో) కొంచెం వీణ్ణి రెచ్చగొడితే ఎల్లా ఉంటాడో

(పైకి) మహాశయా! తక్షణం మీ రెండు చేతుల్తోనూ మీ నోరు మూసుకోండి.

మా——హర హర! అదేం మాటయ్యా!

చం——మూడో వాడూ, మీరూ కూడా మాట్లాడక్కర్లేదు. మీ మొహంవల్లే మీ ప్రశ్నలు తెలుస్తున్నాయి. స్వయంగా విరగ్గైపోండి.

మా——ఇంటికి పెద్దమని పొస్తే, ఇదేనా మీ మర్యాద?

చం——ఏడశావు పోవయ్యా, నాకు పనుంది!

మా——నేను మిక్కిలి పండితుణ్ణయ్యా!

చం——అయితే మెల్లిగా వెళ్ళు.

మా——పండితుణ్ణయినా, మావాళ్ళు పెట్టిన "మాటయ్య" అనే చిన్న పేరు నేను మార్చుకోలేదు.

చం——చూ గొప్పపని చేశావు. లేచిపోదూ.

మా——దొరగారికి చిన్న అర్జీ అండీ. మీరు మంచివారు, ఇది కాస్త చూసి వారిమొదట దాఖలుచేసి పెడతారని గంపెడాశతో వస్తే, కస్సు బుస్సుమంటున్నారే-

చం——నాకు టైంలేదు. నువ్వే వెళుదూ?

మా——(దీనంగా) అనుచర్లు నాబోటగాళ్ళ! దొరగారి దర్శనం లభించనివ్వరండీ. తమ చల్లా సెలవిస్తే పనంగలో ఉగనూ!

చం——(జాలిపడి) సరే, యిల్లా ఇచ్చి వెళ్ళిపోండి. నేను తర వాత దాఖలుచేస్తాను.

మా—(సంతోషించి) మీహృదయం నాకు తెలుసు. చూడండీ, దొర ఏకాకిగా ఉన్న టయంలోనే యిది దాఖలు కావడం నాకు మేలు.

చం—సరే సరే. తమరు వెళ్ళాలి

మా—రక్షించారు. ఇదుగో ఒక్కపిసర వినిపిస్తాను, మచ్చుకి.

చం—అబ్బ! యిప్పుడు నేను వినలేను.

మా—(చిరునవ్వుతో) క్షమించి వినిపించుగోవాలి మరీ! నమస్కారం! కాగితం దాఖలుచేసే వాళ్ళకి కాగితంలోసంగతి తెలియకపోడం కొండొకచో మహాప్రమాదం! (అని,సకిలించి, చదవడానికి చంద్రగిరి అంగీకరించినట్టు సమర్థించుకుని, అర్జీకాగితం విప్పి, హెచ్చరికగా, ప్రవాహంగా చదువుతాడు)

దొరగారికి అర్జీ

"ప్రభూ!

తమరు ఘనులకు అత్యంతవిధేయుడును, అత్యంత భక్తుడును, అత్యంతభృత్యుడును, విశేషించి కేవల నమ్రుడును, అఖండపండితుడును నగు 'మాటయ్య' యను పేర బరగు నేను పుట్టుకచే తెలుగువాడ ననియు, విద్యచే ఆంగ్లవాడ ననియు, సంపర్కముచే తురకవాడ ననియు, వ్యవహారముపట్ల అరవవాడ ననియు వాసింగాంచి ఈమహానగరవీథుల కుడ్యంబులమీదను, అంగణోపరిభాగంబులందునను, పాఠశాలల బాహ్యప్రదేశములకడను కట్టబడియు, పెట్టబడియు, వ్రాయబడియు, వేయబడియు, ఉంప

బడియు, చింపబడియు నున్న అక్షర పదవాక్యరచనా వ్రాతను
లలోనితప్పులతుప్పలును, దోషంబులవిశేషంబులునుతూచితూచి
చూచిచూచి దురపిల్లి దురపిల్లి అవి యన్ని యు నజ్ఞానాంధ కారని
మగ్నులైన వ్రాయసకాండ్ర చెయిదము లనియు, వారందరును,
తిన్న యింటి వాసంబులు లెక్కించువారలై గానుగెద్దును తాంత
రులై కూపస్థమండూకులరై పరంపరాగతమైన వర్ణక్రమ
మాహాత్మ్యంబును, తజ్జనిత పవేక వివేచనాది లక్షణసంపత్తి
యును ప్రవిధ్వంసన మొనర్చుచు, వర్ణవ్యుత్పత్తులు పాటింపక
వర్ణసాపత్యమును మన్నింపక, వర్ణశక్తిని చూడక, వర్ణవైచి
త్ర్యమును గమనింపక, వర్ణమహాసామ్రాజ్యమునకు తలవంపులు
ఘటిల్లజేసి, పైన పేర్కొన్న కృతఘ్నత్వ, అహంకర్తృత్వ,
కించిజ్ఞత్వాది లోపములచే తెలుగుజాతికి నప్రతిష్ఠయు నమర్యా
దయు చేకూర్చి, సదరు నీచరచనలను సూక్ష్మపరీక్షయు నంగాంగ
పరిశీలనయు చేయు నాచారము గల విదేశీయులకును, మరియితర
బహిర్దేశీయులకును హాస్యమున కాలవాలము చేసి, రచనా
వ్యాపారమంతయు అస్తాయిస్తము చేసి వైచుచున్నారు......
గావున......"

చం—ఆగండి, ఆగండి, అర్జీ మరీ పొడుగ్గా ఉన్నట్టుంది.

మా—పొడుగా! ఇందులో ఒక్క అక్షరంకూడా తీసెయ్య డానికి బ్రహ్మతరంకాదు.

చం—దొరగారికి కోపం వచ్చి కుక్కని ఇస్కూ కలుపుతాడు.

మా—కుక్కగనక మీదపడితే, భైరవిమీదతక్కిన అర్జీ పాడెయ్యండి. కుక్కకి విశ్వాసం ఉంటుంది!

చం—నన్నురక్షించి, ఆది ఇల్లాతెండి. నన్ను చంపేశా రంటే, అర్జీ దాఖలవడం జరగదు.

మా—ఎంతమాటెంతమాటా! తమసేవకుణ్ణి, అర్థిని. (అని మోకరించి, నమస్కరించి లేచి) ఇక రెండుముక్కలే!

"గావున, దీనుడైన ఈఅర్జీదారుడు తమ దివ్యఘనతను గూర్చి ప్రార్థించునది ఏమనగా: తమ గొప్పతనముయొక్క చలువ నిమిత్తమును తమపాలనయొక్క వైభవ సూచకముగను, దయచేసి, తాము ఒక మహా పదవి వైళము సృష్టించి, దానికి సర్వవర్ణాధ్యక్షుడు, సర్వవర్ణాధికారి, సర్వవర్ణ స్ఖాలిత్యదండనాధిపతి, సర్వవర్ణ పునశ్చరణాధ్యక్షుడు, సర్వవర్ణజీవనపునఃప్రతిష్ఠాపకుడు— వంటి నామధేయంబేదియో తయారు చేయించి,తత్పదవియు దాని వేతనంబును అర్జీదారునికిం గట్టబెట్టి, తద్వారా ఉన్నతమును గభీరమును అపారమును అయిన నా పాండిత్యమునకు అర్హమైన మూల్యమునగి,రాజ్యమునకును తమ ఘనతకును నేచేసినసేవ సఫలమొనర్చి, తమనామాక్షరంబులు నేను అనేక భాషలలో బంధకవిత్వరూపమున శాశ్వతమొనర్చియుంట..."

చం—లేచి, (కోపంగా) ఏయ్. చాలు, ఆగు. నాకిచ్చేసి, రోడ్డు మ్మగో. దొరగారుచూస్తారు. పనిఅవుతుంది. అయిపోయిందన్నమాటే అసలు!

మా—మీమాటధర్మమా అని అయితేనా, చల్లనివేళ

తెల్సుగుంటాను, మిమ్మల్ని. (సంతోషంతో) మీ రిది పట్టుకుని వెడితే, పని తప్పకుండా అవుతుందని నాకు గొప్పనమ్మకం, ఎంచే తంటే చెప్పలేనుగాని! ఆయన చాలా మంచివాడులెండి మరి. మీ పేరు పూర్తిగా చెప్పండి. మీ నామాక్షరాలు కుడా ఓ రథబంధంలోనో, చక్రబంధంలోనో ...

చం—అబ్బ! ప్రస్తుతం నీకో తాడు బంధం కావాలా, వెడతావా! (అని కాగితం లాక్కుని) ఒరేయ్, మాలోకం! (మాలోకం కుడి మూలనుంచి రాగా) ఈయనకి ఆ సినకాద్రిగారి ఇల్లు చూపెట్టి రారా! ఆయన పాపం ఇల్లాంటి పాండిత్యం అంటే చెవికోసుగుని రాగాలు పెడతాడూ.

మా—చిత్తం.(మాటయ్యతో) రావయ్యా! యిటుగు నడు.

(ఎడను ఎదరకి ముందు మాటయ్యా, వెనకాల మాలోకం వెడతారు).

చం—(కళ్లు తేలేసి, పోయినట్టు కుర్చీలో కూలబడి, తల ఇటూ అటూ తిప్పి, సరిగా కూచుని)

నాపని యింతేగాబోను. వీళ్ల బిజేరెయ్యలేక మాలోకంచస్తున్నాడు ఇకమానుమైం,ఆ అమ్మాయిదగ్గిరికెళ్లి యథార్థం చెప్పి,కోపం పోగొట్టాలి. (దిక్కులుచూసి, కుడిమధ్యకి సంజ్ఞచేసి, వెళ్లబోయి, మళ్లీసోఫాలో కూర్చుని, గడ్డాం తపోయి)

—అమ్మో! మరో యమలాడు! నాజాతకం! నాకు ముందు నిర్యాణం, తరవాత కళ్యాణం! (అని కళ్లు మూసుగుంటాడు).

మాటయ్య— (కుడిమధ్యనించి వస్తూ ఏమండోయ్!

చం—(చూడకుండా) ఎవరు వాడు? (చూసి) ఏం?

మూ—మాటయ్య ఇల్లావచ్చాట్ట, వెళ్లిపోయాడాండి?

చం— ఆ ఆ. మేం పోయింతరువాత ఇప్పుడే వా డెళ్లాడు. నీ కేమవుతాడు?

మూ—ఏమీ కాడండి.

చం—కాకపోతే నువ్వుపడవక్కర్లేదు. పెందరాళే వస్తే ఓకొమ్ము మోసివుండేవాడివి. నీ పేరేమిటి?

మూ—మూటయ్యండి.

చం—ఇంకేం. నువ్వు నా అంతు మూసే వెతతావు; అధమం మూటకట్టేస్తావు.

మూ—రామరామ! మీకు ప్రతీవాళ్లనీ అల్లా కడితే ఎల్లా? మాటయ్య చాదస్తపు శిఖామణుల్లో చక్రవర్తి అనీ వాడు పట్టుగున్నాడంటే జిల్లపాకంలాగ సాగుతాడనీ, వాడికి మెదడు నీలలు రెండుమూడు వదులై ఊడి ఎక్కడో పడిపోవడంవల్ల వాడి మాటలకు అకాలపాండిత్యవర్షం కురుస్తూంటుందనీ వాణ్ణి చేరనియ్యడం ముప్పనీ, వాడు పసరాసివాడనీ తమతో చెప్పి పోవాలని వచ్చాను.

చం—స్వానుభవం పొందాను. మీఅనుభవం విన్నాను. మీరు పొండి.

మూ—తక్షణం. కాని, నేను వచ్చింది మీకు ఐశ్వర్యం పట్టేటట్టు చేసెయ్యడానికి.

చం—(తనలో) ఓహో! బుర్ర గొరిగించుగోడానికి గవ్వైనా

లేని రసయోగి నంటాడు-కాబోలు వీడు! సరి! (పైకి) రారా జుకికూడా ఇంకా ఐశ్వర్యం తెచ్చే మణిపద్దైనా కనిపెట్టారా మీరు?

మూ—అయ్యోకర్మమా, తమరు ఎంత పెడదాన్నె ఉన్నారండీ, ఏమిటో అనుకున్నానూ! నేను మాటల్యాలాంటి శూన్యం కబుర్లు చెప్పే శుంఠననా అనుకుంటున్నారు?

చం— లేదు లేదు. దానికిదగ్గిర రకం మరో టనుకుంటు న్నాను.

మూ—(నవ్వుతూ) నిజం. నారకమే వేరు. నేను అసంభవనీ యాలుచెప్పను.నాసూచనప్రతీదీ చాలా ఆచరణీయం,చాలా ఫల దాయకం. మన్లోమనమాట: నాదగ్గిర ఒక యోగం ఉంది.అది ధనార్జనకి ప్రత్యక్ష విధానం. అది జాగ్రత్తగా ఓ కవరులో పెట్టి సీలుచేసి, కూడా ఉంచుగున్నాను. నావిధానంలో నీచత్వం లేదు. బడాయిలేదు. అయినా, అవసరంగనక, చెబుతాను. నా వి ధానాన్ని క్రియ లోకి దింపితే, రాజుకి ఓ పది- పదిహేను కోట్ల రాబడి పెరుగుతుంది. అతడి కది చాలు నని నా ఉద్దేశం! నావిధానంలో ప్రమాదంలేదు, భయంలేదు, తెలిసి పోతుందని బెంగలేదు, ప్రజల్ని బాధించాలనే దుర్బుద్ధ లేదు,అసలు ఏమికూడాలేదు.ఇంతెందుకూ, నా కాస్తవెత్తూ సాగితే, స్వామీ అమితంగాడబ్బు వర్షిస్తుంది, జనంఅంతా హర్షిస్తారు, నాకు తమ దయఉండాలి.

చం—దయకేం, కావలసినత పంపిస్తాను, బండీ పంపండి.

మరో ఆప్పుడు. ఇప్పుడు కాదు నాకు చాలా తొందరగా ఉంది.

మా—(కుడి ఎడటికి నడిచి) అబ్బ, పోనీగాని, ఇల్లా రండి. చేతులో చెయ్యివెయ్యండి. ఏమైతేఅయింది, మిమ్మల్ని నమ్మి మీకు ధనార్జనగురించిన నాప్రత్యక్షవిధానం చెప్పేస్తాను!

చం—నాకు నద్దయ్యా బాబూ, నీపరమరహస్యం! వెళ్లి పోనయ్యా శెనీ!

మా—(చప్పరించి) ఊరికే అన్నాను. ఒట్టేసుకోవద్దు లెండి పోనీ! ప్రాణం పోయినాసరే మీరు యిది పైకి పొక్కనియ్య రని నాకు తెలుసు లెండి. రెండుమాటల్లో చెప్పేస్తున్నాను.

(అని, ఇటూ అటూ పరికెత్తి, ఎవరూ చాటుగా ఉండి విన డం లేదు కదా అన్నట్టు స్థిరపరుచుకుని, చంద్రగిరి చెవిదగ్గర ముఖం పెట్టగా)

చ.—ఆఁ ఆఁ ఏమిటయ్యా, ఆసిగరెట్టువాసనతో, మనిషివి కావూ!

మా—వినండి. మనదేశంలో ఉండే సముద్రతీర గ్రామాల న్నింటినీ, గుప్ చిప్‌గా, ఏరాత్రో చూసి, రేవుపట్టణాలుగా మా ర్చేస్తే, పాలకులకి అమితమైన రాబడి వచ్చి మీదపడిపో తుంది. ఇదీ, ధనార్జనకి నే కనిపెట్టిన నూతనవిధానం

చం—మీ విధానం అమూల్యం. రాజు సంతోషించి ఎగిరి గంతేసి కాలు విరుచుకుంటాడు మీరు నాకు తరవాత కని పిద్దురుగాని, ప్రస్తుతం పెంటవిరగడ అయిపోదుగా!

మా—చిత్తం. ఇంకోడు ఎవడేనా ఇది తస్కరించి

బహుమతీ లాగెయ్యగల్రు. మీారు సాక్ష్యం. మొదట ఇది చెప్పినవాణ్ణి నేనూ! కాస్త మీారు గట్టిగా సాయం చెయ్యాలి.

చం—అంతా చేస్తా. వెళ్ళండి.

మూ—మరీ...

చం—ఊఁ.

మూ—బాబూ! తమదగ్గిర కొంచెం డబ్బుంటే యిస్తారూ, నావిధానం మెచ్చుగుని ప్రభుత్వంవారు నా కివ్వగల బహుమతీలో ముదరా చూసుగుందాం!

చం—ఓ. ఇస్తాను. అల్లా అడిగాక [illegible] బాగుంది. ఇంత మాత్రంలో పీడ వొదిలిపోతూంటే మరి కావలిసిం దేమిటీ!

(అని తన సంచీ తీసి, మూటయ్యచేతులో ఓ కాగితం పారేస్తాడు. అప్పుడే ఎదమనుష్యం[illegible] నవ్వుకుంటూ మాలోకం వస్తాడు.)

మా—అయ్యగారూ! ఉత్తరం అండి! (అని, ఉత్తరం చంద్రగిరికి ఇస్తాడు.)

(మూటయ్య కుడిపక్కగా, మాలోకం ఎడం పక్కగా [illegible] ఉండగా, చంద్రగిరి, ఉత్తరం చింపిచూసి, కింది సంతకం గమనించి, సుఖవిరామంతో మొదల్నించి చివరదాకా చదువుకుంటాడు.)

మూ—(తనలో గుడా చిరునవ్వుతో) రాజుగారు నన్ను రమ్మన్నారా అండి?

చం—నురేనండి. ఒకాయన ఉన్నారు. ఆయనతో కలిసి మిమ్మల్ని రమ్మన్నారు.

(ఉత్సాహంగా, సోఫా ముంకుకి లాక్కుని కూచుని సంచీ తీసి ఒక నాణెం పట్టుగుని) మాలోకం! రా అమ్మా రా! ఇదుచ్చుగో! గొప్పఉత్తరం తెచ్చావ్!

మా—(పుచ్చుగుని, దణ్ణం పెడతాడు.) ఆయనగార్ని...

చం—ఊం. (అని చెయ్యి ఊపుతాడు.)

మా—రండి.(అని ఎడమాఎగర నిష్క్రమిస్తాడు. మూటయ్య వెనకాలే పోతాడు)

చం—(లేచి ఉత్తరం చూస్తూ) "దమనం మహవం వల్ల యథార్థం తెలుసుగున్నాను. నాతప్పు క్షమించండి. మీరు పంపిన జపంవల్ల కనకాద్రిగారికి మతిపోయింది. మీరు రండి—ఇట్లు, వనప్రియ" (అని చదివి, సంతోషంతో కుడిమధ్యగా నిష్క్రమిస్తాడు)

## రంగం—3

[కనకాద్రి ఇల్లు. వీథివైపు హాలు. మధ్య కనకాద్రి నమస్కరించి కూచుని ఉంటాడు. పాటయ్య, ఆటయ్య, మాటయ్యలు చుట్టూ చతికిల బడి ఉంటారు. కుడి ఎడ్మించి మూటయ్య వచ్చి, లోపల సావకాల వచ్చేవార్ని వెళ్ళిపోమన్నట్టు సంజ్ఞ చేస్తాడు.]

మా—అయ్యా! తమచేనా, కనకాద్రిగారు!

క—చిత్తం.

మా—తమతో ఒక అమూల్యమైన పని నాకు తక్షణం ఉంది. ఎల్లా మరి? త్వరగా లేచి, ఒక్కమాటు ఇల్లా రండి. మీకు గొప్ప అదృష్టం పట్టగా ఉరుణం పోగొట్టుకోకండి. రహస్యం!

క—(లేవబోతూ) చిత్తం. నాకు చాలా తొందర వ్యవహారం ఉంది. అనగా, ఒక ముఖ్యమైన వివాహం సంగతి. నే పెంచిన ఒక అమ్మాయి ఉంది, వనప్రియ!

పా—(కనకాద్రి కుడిచెయ్యి పట్టుగుని కూచోబెట్టి) వనప్రియ చాలా మంచి రాగం. చెప్పరేం మరి! ఇదిగో ఉచితంగా వినిపిస్తా! (అని, పాడి చూపించడానికి గొంతిగ సర్దుకుని, పైగుండీ ఊడదీస్తాడు)

ఆ—(కనకాద్రిని తనవైపు తిప్పుగుని) పేక ముక్కలు సిద్ధంగా ఉన్నాయి, వేళ్ళు కోరుతూ! ఏ వనం అయినాసరే ఆడుకోడానికి నాకు ప్రియమే.

మా—(కనకాద్రిని తనవేపుకి గుంజి) ప్రకృతి వర్ణనలో వనదాహం చాలా గొప్పదన్నాడు కవి. వనవర్ణన నాకు చిన్నప్పుడే ప్రియం!

క—(నమస్కరించే ఉండి, సమాధానాలు చెప్పలేక, పక్కనున్న దిండుమీద ఒరిగి) ఆ అమ్మాయి ఎవణ్ణో చేసుగోదల్చింది. మరోడికిచ్చి ముడెట్టాలని నా ఊహ! అదేదో పరిష్కారం చెయ్యడానికి నేను వెళ్లాలి. నన్ను వదలండి, మహాప్రభో, మీకు ఏమన్నా

ఇచ్చుగుంటాను. (అని పడిపోతాడు)

పూ—ఏమయ్యోయ్! మాట్లాడవేం! రాయి!

పూ—మిత్రమా, విను. రాయి కాదది పెద్ద బండాయి కాని!

ఆ—మరీ పొగరుగా ఉంది.

పా—మఅఅఅరి,పొఒఓగఅఅఉ...మఅఅరి..

మూ—(కనకాద్రిదగ్గిరి కెళ్ళి చెవులో) నీకు గొప్ప ఐశ్వర్యం పట్టే ఎత్తు చెబుతాను, ఒకదెబ్బని.

పా—(కనకాద్రిచెవులో) దెబ్బఉసి దెబ్బఉసి దెబ్బ—థింతా థింతా థిం.

ఆ—(కనకాద్రిచెవులో) మందేమిటో తెలుసా? తురుపు దెబ్బ!

మా—(కనకాద్రిచెవులో) దెబ్బతీయు నరుని దిబ్బచేతు!
(వాళ్లు నలుగురూ కనకాద్రిచుట్టూ ఈగల్లాగ ముసిరి ఉండగా, ఎడమ ఎదర్నించి వనప్రియ వస్తుంది)

వ—(కనకాద్రి స్థితి చూసి ఆశ్చర్యపోయి) ఏమిటండీ! ఆయన్ని అల్లా ఏడేశారేం?

మూ—ఏమోనండీ! వారు మాట్లాడుతూనే అల్లా సోలి పోయారు. ఆయన సర్వారసజ్ఞులని తెలిసి, ఒక ధనార్జనోపాయం వారికి ఉచితంగా ఉపదేశించి పోదాం అని వచ్చేశాను.

ఆ—ఆయన పడిపోయాడు గాని, లేకపోతే ఈపాటి ఓ కో జగిరిపోయిఉండేది.

పా—ఈ పాటికి నేను అతనిచేత స్వరం వేయించి ఉండేవాణ్ణి

మూ—నే నీపాటికి వారిచేత నాలికలకి గుచ్చుకుపోయి ఊడిరాని కవిత్వం చెప్పించేవాణ్ని.

వ—అందుకనే ఆయన కిల్లా వచ్చింది అవస్థ. చాల్లెండి. (అని కుడిమధ్యకి పరిగెత్తి, ఒకగ్లాసులో మంచినీళ్లు తెచ్చి) అయ్యల్లారా! తమరందరూ దయచేసి (ఎడమ ఎదర చూపిస్తూ) ఈమూలకి తప్పుగుని అణగి కూచోండి ఒక క్షణం.

(కుడి ఎగరనించి చంద్రగిరి వస్తాడు. వెనకాలే నాలోకం ఉంటాడు. చంద్రగిరి చటుక్కున వెళ్ళి వసంతసేనచేతిలో ఉన్నగ్లాసు పుచ్చుగుని, కనకాద్రిని సవరించి, అతణ్ణి సేద దేరుస్తాడు.)

మూ—ఇదుగో చంద్రగిరిశశేఖరుడు సిక్రే వచ్చె నిప్పట్టుసన్.

పా—నాగానమే....

ఆ—నే కొన్న కొత్తసేక చూస్తే చచ్చిన వాళ్ళు బతుకుతారు. ఈయన పడిపోయాడు. మనం ఆడదాం రావయ్యా. ఒక్కాట. వారు లేస్తే జేస్తే!

మూ—నన్ను ఈ జబ్బువాడిదగ్గరికయ్యా పంపించావు?

చం—వస్తున్నానండి. ఓ అమ్మాయి! ఇల్లారా! వీరికి కొంచెం ఉపచారం చెయ్యి. కొందరు గొప్ప వాళ్లకి కనకాద్రి గారు విందుచేస్తారని నాకు తెలిసింది. వీరందరూ అన్నాలని నాకు తోచి, నాకు తాళతులేక, వీరికి ఇక్కడికి దారి చూపెట్టించాను. ఎన్ని నడిసున్లకేనా తట్టుకోగల కనకాద్రి

గారికే ఈఅవస్థ ఇల్లా రావడం నమ్మశక్యంగాకుండా ఉంది. ఒకేయ్, మాలోకం !

మాలో—అయ్యా!

చం—నీకందర్నీ (ఏకమనుష్యాగా ఒక చెయ్యి చూపించి) ఆ గదిలోకూచో పెట్టి రా. అక్కడ బల్లలూ కుర్చీలూ గ్లాసులూ అవీ సర్వసిద్ధంగా ఉండిఉంటాయి. ఇక ఫలహారాలూ వంటకాలూ వీరి ఏర్పాటుప్రకారం వస్తాయిగావును మరి. త్వరలోనే నువ్వూ నేనూ వడ్డించుదాం. తీసిగెళ్లు. స్వాములూ, అల్లా దయ చెయ్యండి.

(మాలోకం వాళ్లందర్నీ ఆశగా నడిపించుగుని తీసిగెడతాడు. మళ్ళీ వెంటనే వస్తాడు)

చం—అంతా ఆగదిలో ప్రవేశించారురా ?

మాలో—చిత్తం.

చం—ఇదుగో తాళం! (అని జేబులోంచి తీసియిచ్చి) ఆగదికి పైన గొళ్లెం వేసి, ఈతాళం నొక్కి చక్కా రా!

వ—ఈయన కొంచెం కదల్తున్నారండి.

చం—ఇక కళ్లుకూడా తెరుస్తారు.

క—(కళ్లు తెరిచి, లేచి కూచుని) అబ్బ! ఎవరదీ! వన ప్రియా! నాచుట్టూ జనం కూచుని వదలకుండా జలగల్లాగ పట్టుకునిఉ న్నారు. ఏరి ?

వ—వెళ్లిపోయారు.

చం—వెళ్ల లేదండీ! మీయింట్లోనే ఆగదిలో ఉన్నారు.

క—(భయంతో) మళ్లీ వస్తారేమో! ఆ గదికి తాళం వెయ్య లేకపోయామూ! (అని, తేరపార చూసి) ఎవరదీ? చంద్రగిరా! (కోపంతో) ఏమబ్బాయి, నీకేం పని ఇక్కడా?

(చంద్రగిరి కనకాద్రికి నమస్కారం చెప్పకుండానే ఎడమ మధ్యనుంచి సూరాలోకం వచ్చి, చంద్రగిరితో)

సూరాలో—అయ్యగారండి. నేను చెప్తేనే తాళం వేశా నండి. అక్కడ నుంచుంటే నామీద కిటికీలోంచి ఉమ్మేస్తున్నా రండి.

చం—ఎడంగా నుంచో, అక్కడే ఉండు. కాపలా ఉండక పోతే, పెంకు లెగిరేలాగు దెబ్బలాడుకుని, తద్వారా పైకొచ్చినా తెలియదు.

వ—(కనకాద్రితో) మనకీ ఉపకారం చేసినవాడు ఆయనే!

క—(ఆనందంతో) నిజమే? ఇతడే?...... అబ్బాయి, చంద్రగిరీ! ఈ ఉపకారం మాత్రం నేను మరవలేను. లోగడ నిన్ను గురించి ఏమిటో అనుకున్నాను. నన్ను బతికించావు, నామతి పోకుండా రక్షించావు. వనప్రియను నీకే ఇస్తాను.

చం—అంతటి సువార్త తమ నోటంట వచ్చినందుకు చాలా కృతజ్ఞుణ్ణి! కాని, ఆ అమ్మాయికి అంగీకారం ఉండాలి కదాండి!

వ—(కనకాద్రితో) ఆయన అల్లా ఊరికే అంటున్నారండీ!

క—(లేచి) మరి పదండి. మరోళ్లూ ఇంకోళ్లూ వచ్చి చుట్ట పెట్టుకోక పూర్వమే ఆకల్యాణం కాస్తా కానిచ్చుకుని చక్కా

వద్దాం. వేగిరం నడవండి...మన్లోమాట: వీళ్లు ఎల్లానో పైకొచ్చి పడదుగద !

చం—ఫరవా లేదండి. మా మాలోకం ఉంటాడు లెండి ఇక్కడ.

మాలో—చిత్తం. ఎడంగా నుంచుని చూస్తూంటాను.

(ఎడమఎదరనించి దమనం, సుముఖం వస్తారు)

—అయ్యగారండి. వీళ్లిద్దర్నీ కూడా ఖైదుచెయ్యాలండీ!

చం—టట్, ఊరుకో. వీరిదే ఈ పులవ అంతా! అమ్మాత్ర రండి. మీరు మాతో ఉండి మా వివాహం చేయింతురుగాని! ఒరేయ్, మాలోకం, నువ్వు ఆస్వాముల్తో చెప్పు—"ఇక కాస్సేపట్లో నేట, పెళ్లిభోజనాలు! మీరు తయారవండి! మిమ్మల్ని సత్కరించి పంపిస్తారట!" అని. వాళ్లు కోరేవి అంతే.. వనప్రియా, రా!

(అనగా, వనప్రియ వచ్చి చెయ్యి ఇస్తుంది. వాళ్లిద్దరూ ముందూ, తరవాత దమనంమరువాళ్లూ, కనకాద్రీ నడుస్తూండగా తెర పడుతుంది)

—

# రెండు రెళ్ళు నాలుగు

[మోలియర్ రచనల్లో ఒకదానికి ఇది మిక్కిలి దగ్గిర అనుసరణం. ఇది మొదటిసారి 24-1-1942 తేదీని రాజమండ్రీ ఆర్ట్సు కాలేజీలో శ్రీ రాయసం వేంకటశివుడుగారి అధ్యక్షతకింద జరిగిన పూర్వవిద్యార్థి వార్షికోత్సవ సమావేశ సందర్భంలో, అనుమతితో, ప్రదర్శించారు.]

## పాత్రలు

శానయ్య—భర్త

అనంతం—ఒక గృహస్థు

లీలారావు—వరుడు

గరుడవాహనం—ఒక ధనికుడు

శీలం—అనంతం కూతురు

చంచలం—అనంతంఇంట్లో దాసీ

చంద్రవంక—శానయ్య భార్య

## పాత్రధారులు

శ్రీ దుగ్గిరాల సత్యనారాయణరావు

,, పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు

,, అనసూరి కృష్ణమూర్తి

,, వర్రె సుబ్బారావు

,, బి. యస్. అనంత పద్మనాభరావు

,, వి. వీరభద్రరావు

,, కె. కామేశ్వరరావు

## రంగం-1.

[అనంతంఇంటి ఎకటిభాగం. కుడివైపు వీధి. ఎడమఎదర శీలం దుఃఖిస్తూ కూచుంటుంది. పైమీద కండువా అదీ వేసుకుని, అనంతం, వీధిలోకి వెళ్లే యత్నంలో ఎడమ వెనకనించి వస్తాడు.]

అ—అమ్మాయి, శీలం!

శీ—(కళ్ళనీళ్లు తుడ్చుకుంటుందిగాని, మాట్లాడదు.)

అ—శీలం! (ఆగి) ఆఁహాఁ! మాట్లాడను చూడండి రాయల్లానూ!

శీ—(ఏడుపు ఆపుకుని) నే ఒప్పుకోను. నా కక్కర్లేదు. నువ్వు తెచ్చిన కొత్త సంబంధం నేను సుతలామూ చేసుకోను.

అ—చేసుకోవ్! ఔరా! ఎంత పెంకితనమే, నీ పెంకితనం పెత్తనానికెళ్లా! నీ కోసంగదా అని ఎంతో ఆలోచించి నేను ఒక శాశ్వతమైన ఏర్పాటు చెయ్యబోతూంటే (బుర్రతిప్పుతూ) "ఊఁహుఁ ఊఁ—అల్లా కాదు—ఊఁహుఁ ఊఁ" అంటూ నువ్వు కూచోడమా! ఇదేనా వరసా! నాకు, ఇంటో ఆమాత్రం సర్వాధికారమూ లేదూ! నీ గచ్చకాయబుర్రతో నువ్వు చేసుగున్న బుర్రిబుర్రి ఆలోచన్లు, చెట్టంతవాణ్ణి, నా జ్ఞానానికి అడ్డొస్తేనా ఊఁహూఁ! ఓసి వెర్రితల్లీ, ఇంటిపెత్తనం ఎవరిదమ్మా నీదా నాదా? నీ మంచిగురించి నీకు సలహా చెప్పడానికి ఎవరి

బుద్ధి గొప్పకటాన్!...సరేకాని, అమ్మాయీ, నాక్కాస్త కోపం తెప్పించకు. నా కింకా పులుపు చావలేదు.

శ్రీ—అయితే ఏమంటావ్, నాన్నా!

అ—ఏమంటానా! నోరు మూసుకుని నే చెప్పిన వాణ్ణి కట్టుకోడానికి ఒప్పుకోమంటాను. చూశావా! నోరు చెయ్యకు, "ఆ అబ్బాయి ఎల్లా ఉంటాడో, ముందు నేను మాత్రం చూసుకోనద్దూ!" అంటూ దీర్ఘాలు తియ్యకు! సరే!

శ్రీ—దీర్ఘాలు తియ్యకపోతే ఎల్లా నాన్నా!

అ—ఛీ, ఊరుకో, నీ కేం తెలుసునూ! నేను చూసు చెబుతూన్న కొత్త అబ్బాయికి ఎంత ఐశ్వర్యం కొట్టుకొస్తుందో నాకు తెలుసు! ఐశ్వర్యం ఉంటూన్నప్పుడు కడుపు ఎందుకన్నాను! వేలాడిగా ఆస్తిగల మొగుడికి వశీకరణ లక్షణాలక్కోత్తేసినట్టు పెరిగావా! నాకెల్లాగుంటు ఉండదని, ఆస్తియావంత అతణ్ణి తొక్కల్లో కట్టితీరాలి. ఏమో! గల్లా అంటాను!

శ్రీ—అయ్యో, హయ్యో!

అ—(అనుకరిస్తూ) 'అయ్యో' అనా అన్నావ్! ఎంత బుద్ధిలేని 'అయ్యో' వినిపించావే అమ్మాయి! నామతి చెడగొడుతున్నావు సుమీ! ఇదేమీ అల్లాటప్పా వ్యాపారం కాదు, పెద్దమ్మల్లసంట. జాగ్రత్త! నామాటగనక వినకపోతివా, తరవాత సార్థకంగా 'అయ్యో' అనుకోవలిసొస్తుంది. అహహో శాస్త్రీస్వా ఊహూ ఆ దిక్కుమాలి నసలలు చదవటంవల్ల వచ్చిపడ్డది ఈ ప్రాలుబ్ధకర్మం! ప్రేమా, ప్రణయమూ, వాటి

చుట్టూ ప్రదక్షిణంచేసే సత్తరకాయిభావాల చెత్తా, ఇవన్నీ నీబుఱ్ఱగుంజుని అంటుకుపోయాయి. నిక్షేపంలాంటి మనస్సుకి అవి నిప్పెడతాయి. అటువంటివి కట్టగట్టి తగలబెట్టి, ఓ నీతి వాక్యాలనీ, ఓ మూల వచనాలనీ, ఓ భక్తిగ్రంథాలనీ, ఓ సత్య కీర్తనలనీ—ఇటువంటివి దీక్షతో పఠించుకుంటే, (చిరునవ్వుతో) అప్పుడు నీకు తెలిసొస్తుంది—తండ్రిమాట, మాటేకాదు చివరికి తండ్రి సంకల్పంకూడా సంతానం ఎంతగా మన్నించ వలిసి ఉంటుందో! విన్నావా!

శ్రీ—సరేగాని, నాన్నా! వెనక లీలారావుమీద నేను దృష్టి నిలుపుకోవలసి ఉంటుందని నువ్వేఅన్నావూ! పట్టుపట్టావూ! పోనీ పెద్దవాడు చెబుతున్నాడూ, అల్లానే కానిద్దాం అని ఆ యత్నంలోనే నే నిప్పటివరకూ ఉన్నానూ! అతణ్ణి ఇప్పుడు నేను మరిచిపోవాలని నీఆజ్ఞాసూ, పైపెచ్చు పురోహితుడ్ని ఎన్నుకోవాలని సూచనానా! (నోరునొక్కుకుని) హవ్వ! లీలారావు మీద నాకు గలిగిన భావాన్ని ఎంజెయ్యను నాన్నా!

అ—గిరగిరా తిప్పి దూరంగా పారెయ్, కూతురా! ఐశ్వర్యాన్ని కూడిన వయస్సు సకాలంలో చేజిక్కిన పక్షంలో, లీలారావులాంటివాళ్ళమీద భావాలు ఎన్నున్నా సరే అవీ, వాళ్ళకిచ్చిన వాగ్దానాలు ఎన్నున్నా సరే అవీ, కలేసి ఏకంగా మూటగట్టి వెనక్కి గిరవాటెయ్యవలిసిందే అంటాను. లీలారావు (వెకిలిగానవ్వుతూ) ఎఱ్ఱగా బుఱ్ఱగా ఉంటాడు. నేనూ ఒప్పుకుంటాను, నాకూ కళ్ళున్నాయి, కనిపిస్తాయి, చూశాను.

అతడు మాంచి చూపులగుఱ్ఱం! అంతే! కాని, డబ్బుగురించిన ఆలోచన మొదటే చెయ్యాలి! కడం ఆలోచన్లు దానికి ఓయా బై చీడీలు కిందమాటా! నోట్లోంచి బయటికి రాబోయే డోకు ఉందనుకో—దానికి డబ్బు చూపిస్తే అది పరమాన్నంగా మారిపోయి వెనక్కితిరిగి విలాసంగా లోపలికి చక్కాపోతుంది! అందువల్ల ముందు డబ్బూ, తరవాత బాబూ! నేనిప్పుడు అంటూన్న అబ్బాయిని నువ్వు ప్రేమించవని నాకు తెలుసు. అతడిమీద నీకు ప్రేమభావం లేకపోతే అదే పోయె, పోని భర్తభావమేనా ఉంచుకో! భర్తభావంలోంచే ప్రేమభావాలు చాలా సందర్భాల్లో పుట్టుకొస్తాయని చెబుతారు...సరే! నామతి మండినట్టు ఉంది. నేను ఆజ్ఞాపించవలసినవాణ్ణి, నాకు వాదనతో పనేమిటి? నీ ఉపన్యాసాలూ నాకొద్దు, నీ చాడీలూ వద్దు! నువ్వు ఒప్పుకుతీరాలి. ఏం?

శీ—(తల వంచుకుని మాట్లాడకుండా ఉంటుంది)

అ—ఒప్పుకోకపోతే, తెలుసు అనుకున్నా!...సరేలే, మళ్ళీ వచ్చి చెబుతా!

(అంటూ, విసురుగా కుడిమధ్యకి వెళ్ళిపోతాడు. గడ్డం కుడిచేత్తో పట్టుకుని, కుడిమోచేతికింద ఎడంచెయ్యి పెట్టుకుని, చంచలం, కుడిపదర్నించివస్తుంది)

చం—ఏమండీ శీలమ్మగారూ! నాన్నగారికి కోపం తెప్పించినట్టున్నారే!

శీ—(మాట్లాడదు)

చం—(సంతోషంగా) నాన్న చెప్పిన అబ్బాయిని ఒప్పుగోండీ! ఎందుకండీ తమకి పట్టుదలా!

శీ—నీకు తెలియదు, ఊరుకో, ఒసీ!

చం—నాకు తెలియదనే పిల్ల వేసమ్మా మెట్టుకి! నిన్నే చూశాను ఇల్లాగ! ఇంకోళ్ళయితే ఈపాటి ఎగిరి గంతేసి ఒప్పేసుగుని ఉండేవారు! శుభమల్లా పెళ్ళికి తొందుతూనే ఏమమ్మా? ఎక్కడేనా ఉంటుందా ఇల్లా! సరే అంటే తీరిపోయె "సరే" అనే అక్షరాలు ఎంత సరియైన అక్షరాలూ!...అయ్యో, నా గతి! ఎవరేనా మహానుభావుడు, నాకోసం భర్తని వెతిగి తెచ్చి నా ఒప్పుదల కోరితే, నేను ఒకసారి కాదు, డజనుసార్లు గుక్క తిప్పకుండా (తల గబగబా ఊపిస్తూ) "సరే—సరే సరే సరే-సరే-సరే" అనేసి ఉండేదాన్ని. అంతేగాని, ఏమమ్మల్లే ఏడుస్తూ కూచుండేదాన్నా! ... అయితే, నాదశ (అని కళ్లు తుడుచుగుంటుంది)

శీ—ఒసేవ్, ఊరుకో! నీ పెళ్ళికోసం నువ్వేడిస్తే నేచావాలి.

చం—ఛఛ ఊరుకోండీ, ఏం మాటలవి! (నవ్వు తెచ్చుగుంటూ) నేను మొండిదాన్ని. ఊరికే అన్నాను!

శీ—అయితే నన్నేనేమాట, లీలారావుని ఇష్టంతో నేను వదులుకోవాలనా? అంత దుష్ప్రవర్త లోకి దిగనా! నాన్నన్నాడని, మానాన్న మళ్ళీ చెప్పిం అవకరపుమనిషిని నేను కట్టుగోనా?

చం—కాదండీ! మరి, ఆ లీలా రావుగారు ప్రతిమించినా వాళ్ళ ఊర్కొంచి ఊడిపడలేం? ఇంత ఆలస్యం ఎప్పుడైతే చేశాడో,

ఆయన మనోక్షోభాన్ని ఆశ్రయించాడని నా అనుమానం!

శీ—(లీలారావు చిత్రింపబడ్డ బొమ్మ చంచలానికి చూపించి) నీ అపశకునపు మాటల్తో నన్ను బాధించకు, నీ పుణ్యం! ఈ లక్షణాలు చూడు! వీటిల్లో నిశ్చలప్రేమ వెల్లి విరిసిపోతోంది. ఏమో! ఇది మోసం చెయ్యగల మొహం అని నేను నమ్మను. ఈచిత్రమే ఇంత సత్యంగనక, ఆవ్యక్తి పరమ సత్యమే!

చం—(బొమ్మకేసి మెప్పుతో చూస్తూ) నిజమేనండోయ్! ఈ మొహం చాలా సరళమైన మొహం. నవనీతంలాంటి మీ ప్రేమకి సరియైన ఉక్తి ఇదే!

శీ—అయినా సరేట, నేను అది వదులుకోవాలిట! ఇంకో సంబంధంట... అయ్యో, అయ్యో...

(అంటూ, ఆ సంకల్పమే తనకి దుర్భరంకాగా, బొమ్మ చేతులోంచి జారవిడిచి, కూలబడి, వెనక్కి పడిపోబోతూంటే, చంచలం తన చెయ్యి అడ్డు పెట్టి కూచునేస్థితిలోనే శీలాన్ని పట్టుకుంటుంది.)

చం—అమ్మగారూ, అమ్మగారు!...అయ్యబాబో, మాట్లాడడం లేదు. (దీనంగా) మూర్ఛపోయినట్టుంది...(గట్టిగా) అమ్మో బాబూ! ఎవరేనా సరే, రండికండి. వచ్చి రక్షించండి.

(అప్పుడు కుడివైపునించి శీఘ్రంగా శానయ్య వస్తాడు)

శా—(వచ్చి, నిదానించి) ఆగు. ఏమి టాగొడవ? మేం వచ్చాం. మాతో చెప్పుగో నీబాధ! పోనీ సావకాశంగా వింటాం!

చ —(ఏడుపు మొహం పెట్టి) మా అమ్మాయిగారు మరణించడానికి సిద్ధంగా ఉన్నారు. (అని, అన్న తరవాత మరీ దుఃఖిస్తుంది)

శా—ఓస్, ఇంతేనా! ఇంకా ఏమిటో అనుకున్నానూ! భూప్రళయం వచ్చినట్టు గోలచేశావే? సరే, చూద్దాం ఉండు. (శీలని కేసి చూచి) ఏమండీ! అమ్మాయిగారూ! మీరు మరణించేసినట్టే? ఔరా! ఒక్కమాటైనా అనవే, రకం ఏమిటో నాసి! చాలా విచిత్రంగా ఉందే!

చం—బాబూ! నేను శీవిణ్ణి కొంచెం ఇల్లా పట్టుకుని ఉండండి. ఈవిణ్ణి లోపలికి తీసుకుపోడానికి నే వెళ్లి ఎవర్నైనా పిల్చుకొస్తానూ.

(అని ఆవిణ్ణి శాస్త్రికి అప్పచెప్పి, 'అమ్మో అమ్మో' అంటూ కుడిపక్కగా పోతుంది.)

శా—(ఎడమకి తిరిగి కుడి కాలు మీద మోకరించి, తన ఎడమచేతి మీద శీలాన్ని ఆనుకోపెట్టుకుని, కుడిచేత్తో ఆవిడ చేతులూ పాదాలూ పట్టుకుని చూసి) పాప, ఎవరో ఈ అమ్మాయి! ఏమి మొన్మాయో, ఎంతపని చేశావమ్మా! చేతులూ కాళ్లూ చల్లబడిపోయాయి. నాకు ఏమి ఆలోచన పోకుండా ఉంది. కాస్తంత ఊపిరేనా ఇటూ అటూ ఉన్నదేమో చూస్తాను. (అని ఆ మొహంముక్కు దగ్గిర తన కుడిచెయ్యి, తరవాత తన ఎడంచెవి పెడతాడు. కుడిపక్కకి చంద్రమ్మ వచ్చి ఈ దృశ్యం చూసి-)

గాని, (చీపురుకట్ట ఎడమమూలకి విసిరి) ఆ నూరాయలమారి కన పడకపోయేసరికి ప్రాణం చివుక్కుమంది. ఏమయితేం! నన్ను ఈ రాలుగాయిగుడు మోసపుచ్చినమాట నూరి. నాకళ్ళతో నే నే చూసేసినప్పుడు, మరోరి సాక్ష్యం నాకెందుకూ? నా అంత మాటవనతిపట్ల ఇంత గుండెలులేకుండా వర్తించాడు వీడా నాభర్త! ఇతగాణ్ని భరించే ఈ గంథకర్తా నాకు భర్త! ఛీ, కృతఘ్నుడు! ఈ నరసుడికి ఇక నే నెందుకూ! ఔరా! భర్తల ప్రేమబదలాయింపు ఎంత చౌకబేరం! భార్యల ప్రేమబదలాయింపు ఎంత ఘోరనేరం!

(అని తల పంకించి ఉసూరుమంటూ ఆలోచిస్తూ, అక్కడ చిత్రం పడిఉండడం చూసి, సంతోషంతో అదిలీస——)

ఓహోహో, ఏమిటీ అదృష్టం! మంచిబొమ్మ! చిత్రం! కనుబొమ్మలెత్తి, పెదిమిబిగించి అంగీకరించినట్టు మెడ తిప్పుతూ) అబ్బో! అబ్బో! మనోహరం, దివ్యం!

(అని, కుడిఎదరకి నడిచి కుడివైపుకేసి తిరిగి, బొమ్మ కుడిచేత్తో పట్టి ఆనందిస్తూ కూచుంటుంది)

శా——(ఎడమఎదరకి వచ్చి) ఆవిడ పోవడం లేదు, ఏమీ లేదు. దాసీది అనవసరంగా కేకలేసి ఏడిపించింది. అన లావిడ నిక్షేపంలా ఉంది. (కుడిపక్కకిచూసి, వెనక్కి ఒక అంగవేసి) ఇదుగో మా గృహలక్ష్మి!

చం——(తను ఒక్కతెమాత్రమే ఉన్నా ననుకుని) ఔరా!

ఇంచక్కటిదో! ఏమి బొమ్మ! ఏమి అందగాడు! (అని తల తిప్పుతూ నాలికతో అంగుళం నొక్కిచెప్పుతూ చేస్తుంది)

శా—(జాగ్రత్తగా భార్యవంక నుంచి బొమ్మకేసి చూసి మళ్ళీ ఎడమవైపు దరకళ్ళెత్తి చూస్తూనా) అది ఏమిటో చెప్తే అంత శ్రద్ధగా చూస్తోందీ! అది ఎవరి ఆకారమో! ఆ బొమ్మ నా స్వంత గౌరవానికి అపశకునంగా కనిపిస్తోంది. అసంఖ్యమైన అనుమానాలు అప్పుడే నాలో మొలకెత్తుతున్నాయి.

చం—(భర్తని చూడకుండానే) ఏమో! ఇంత అందం జన్మలో చూడలేదు. ఇంతకంటే అందం ఎక్కడా ఉండదు. (బొమ్మ కళ్ళకి అద్దుకుని) ఈ బొమ్మ ఎంత సజీవంగా కూడా ఉందో!

శా—(తనలో) ఓహో! బొమ్మకి ప్రాణమున్నట్టుగా నాకనే లాగ కనిపిస్తోంది. ఇక వెళ్ళి ఆబొమ్మ లాగేసుకోవాలి. లాగేస్తా నన్నమాటే. లేకపోతే ప్రమాదం స్వంతకళ్ళతో చూడవలసివస్తుంది.

చంద్ర—(ఇంకా తనలో) ఇల్లాంటివాడు కళ్ళకి అగుపడినప్పుడేగదా స్త్రీయొక్క జన్మ! ఆడదానై పుట్టగానే సరా! ఇతడు స్వేచ్ఛంగా బయల్దేరి తనహృదయంలో ప్రేమవాసనంగా వ్యక్తపరచడం మొదలెట్టినప్పుడు, చలించకుండా, మనస్సు చిక్కబట్టిఉండడం ఎంతకష్టం! అయ్యోయ్యో! నేను ఇల్లాంటి మొగుణ్ణి కలిగి ఉండడం అనేది నోచుకోలేకపోయానుగదా! (కుడిచేత్తో నుదురు కొట్టుకుంటూ) నాదురదృష్టంకొద్దీ నాకు పోగయ్యాడు—

ఖాళీగల, ముసిరికట్టు, మట్టిగిడస స్వరూపం......అవ్వ (అసనోరు నొక్కుగుంటుంది.)

శా—(పైపమాటలకి కోపం అభినయించి చరచరా వెళ్ళి బొమ్మలాక్కుని) అనరాని మాటలు ముగుణ్ణి అంటూండే క్షణ మందే నిన్ను బరిమిూన పట్టుగున్నాను! ఆఁసు! అల్లానా, ఇంకా చెప్పావుకావూ! అయితే, ఓసీ, నానెత్తిమిూది పెళ్ళాం! నీఅంత గొప్ప పెళ్ళానికి ముగుడు—అంగా, (తన్నే చూపెట్టుకుంటూ) వీడు— తగ్గవాడు కాడు అని ఆలోచనమిూద కనిపెట్టావా? ఓసి శనీ! నాసంబంధంకంటె గొప్పది మరోటి నువ్వుతపిస్తేమాత్రం వస్తుందటే! నాకు అవలక్షణాలు ఏమున్నాయి? ఈరూపం (అని మిూసంమిూద చెయ్యివేసి), ఈకేవి (అని ఒకటి రెండంగలు వేసి), అసలు నేను ఊరికే నిలబడితేచాలు, మెచ్చుకోనివాడు లేడే! ఈ ముహం! ఇది ఎంత మోహావేశం జనింపచేస్తుందో తెలుసా? ఈ ముఖదర్శనంకోసమే కదూ రాత్రింపగళ్లు వేలకొలది సుందరీమణులు నిట్టూర్పులు విడిచేది? ఏమైతేం! ఇంతకళగల ముహం నీకు చీనుంతైనా ఆనందం కలిగించడానికి సరిపోయింది కాదేం? పాపం పోన్లే. నాకూ తెలుసు. నా జాగ్రత్తమిూద నే నుంటాను. నీ పాడుకోరికలకి మద్దతు చెయ్యడానికి భర్తకికూడా తుంటరిలక్షణాలు ఉండాలని కోరతావుగావును!

చంద్ర—నువ్వు ఇల్లా ఎందుకు నోరుచేసుగోడం మొద లెట్టావో నాకు తెలుసు. ఈ మిషమిూద నువ్వు నీ తుంటరితనం కప్పెట్టుగోవాలని!

శా—అబ్బొబ్బో! నన్ను మోసపుచ్చడానికి యత్నించకో మరీ! సంగతి బట్టబయలైంది. నా ఫిర్యాదు నెగ్గేది కావడానికి చచ్చినంత ప్రత్యక్షసాక్ష్యం నా చేతులో ఉంది.

చంద్ర—అసలు నాకు ఇందాకానే నీమీద కోపం వచ్చేసి సిద్ధంగా ఉంది. ఇంకోటీ మరోటీ నేరాలు నువ్విప్పుడు నవ్వుకొచ్చి నన్ను విసిగించక్కర్లేదు. విన్నావా? నా చక్కటి బొమ్మ నాకిచ్చెయ్. ఒక్క క్షణం కూచుని ఆలోచించు.

శా—ఇదే అదే. ఆలోచిస్తున్నాలే, ఆలోచిస్తున్నా—మొడగూళ్ళు విరగ్గొట్టడం ఎల్లాగా అని. అసలు [illegible] సర్వం నా చేతులోని బొమ్మ అయిపోయిందిగా, ఆ అసలు వాజమ్మ వ్యక్తి అయిఉంటేనా!

చంద్ర—ఆ వ్యక్తి అయిఉంటే ఏం జేస్తావ ?

శా—ఏమీ చెయ్యను, ప్రేయసీ, ఏమీ చెయ్యను. నువ్వో ప్రేమనిధివి కాదూ, (పకిలిగా నవ్వుతూ) ప్రేమజలధివి కాదూ, (నమస్కరిస్తూ) ప్రేమమూర్తివి కాదూ, అందుకని నేను నిజంగా నోరెత్తి ఉండకూడదు. నా నుదుటి రాత ఇల్లా ఉన్నందుకు అవసరాన్ని బట్టి నిన్ను మెచ్చి ఉండవలిసింది. (బొమ్మకేసి చూపిస్తూ) ఇడుగో, ఈ బొమ్మలో ఉన్నాడు, నీ యువకుడు, నీ సరసుడు, నీ అపవిత్ర స్నేహితుడు......

చంద్ర—ఏమిటి నీ వాగుడూ!...కానీ...

శా—ఎల్లా? చచ్చేటంత కోపం, వల్లమాలినంత సిగ్గూ నన్ను ఎడాపెడా పట్టుకున్నాయి.

చంద్ర—నీ మతికత్తోడు నువ్వూ తాగికూడా రాలేదు కద!...తిన్నగా చెప్పూ.

శా—నీకు తెలియదేం? నాచేతే చెప్పించాలనా! సిగ్గు లేకపోతే సరి! సి చేష్టల్నిఒట్టి సన్నికట్టెణ్ణించి శానయ్యా అనకు. సానయ్యా అంటాను. నా జెండా పడిపోయింది. పడగొట్టింది నువ్వే గనుక, ముధనం నీ చెయ్యి ఒకటీ, పక్క ఎముకలు రెండూ ఊడగొడితే గాని నాకళ్ళు చల్లబడవు.

చంద్ర—ఇనా నీ మాటపసుపు!

శా—లేకపోతే, నాయెగట రాక్షసి వేషాలేస్తావూ?

చంద్ర—రాక్షసివేషా లేమిటీ? ఫలానా అని ఏడవరాదూ?

శా—అల్లాంటివి చెప్పాయిస్తుకాదు.

చంద్ర—ఔరా! ఎంత దారుణ ద్రోహం చేస్తే స్త్రీకి కోపం వస్తుందో అంత ద్రోహమూ, నాకు నా కళ్ళఎదట చేశావూ! పైగా నీ కేదో ద్రోహం చేసినట్టు నటన మొదలెట్టావూ బోడి నటనా! దాంతో నాకు వచ్చిన సత్యాగ్రహం తుడుచుకుపోతుం దనుకున్నావూ? ఎంత నేర్చావూ? దెబ్బ తీసినవాడవూ నువ్వే, తరవాత మళ్ళీ మొదట్లోనే దెబ్బ లాడేవాడవుకూడా నువ్వే!

శా—(తెల్లపోయి) ఎంత రాజీలా మాట్లాడుతోందో! ఇంత దర్జాగా వాదిస్తూంటే ఎవడేనా విని 'అవును. ఈవిడలో కళంక వేమిటి పో' మ్మంటాడు కుడాను.

చంద్ర—సరే, సరే. నువ్వు అల్లాగే సాగుతూండు. నీ సరసురాళ్ల అందాలు మెచ్చుకుంటూ కూడానో. నీ క్రొత్త ప్రేయసిమీద ప్రేమ నిమ్మరించు. (మొటికెలు విరుస్తూ) నీ మోహానాంగిని మురిపెట్టుకుని, ముక్కలవు. కాని ఎదురు తిరిగి, నేనొచ్చి నిన్ను నగా చేశాననటూ కథమాత్రం అల్లకు! అమ్మ చెల్లా! నే నంత ... విన్నద్దెహదాన్ననా! (అని శానయ్య చేతిలోంచి బొమ్మ ఊడలాక్కుని, కుడిఎడటినించి పరుగుపుచ్చుకుంటుంది).

శా—ఒస్, నీ పరుగు నేను అందుకోలేనా! (అని శానయ్య వెంటాడతాడు. చంద్రవంక కుడిమూలనించి మళ్ళీ వచ్చి కుడి ఎదరకి పరిగెట్టి వెళుతుంది. వెనకాలే శానయ్య కూడా పరిగెట్టి వెడతాడు)

## రంగం - 2

[శానయ్య ఇంటి ముందు వీధి. చాలా ప్రయాణపు బడలికతో, రేగిన జుట్టుతో, అప్పుడే దిగినట్టు ఓ పెట్టె చేత్తో పట్టుకుని, లీలారావు, ఎడమ ఎదరనించి వస్తాడు. పెట్టె పక్కగా, కింద పెడతాడు. జేబులోంచి రుమాలు తీసి మోహం తుడుచుకుంటాడు.]

లీ—ఈవూరు రావడం అయింది గనక, ఇక శీలమణి దగ్గిరికి వెళ్ళిపడాలి. నాకు ఈ నౌఖరు ఎక్కడ దొరికాడో

గదా. నా కేమీ బడలిక లేదు, వాడి కేమీ స్తిమితం లేదు. నాకు కునుకు లేదు, వాడికి మెలకువ లేదు. నాకు ఆకలి కనబడదు, వాడికి తిండి చాలడం కనబడదు. నాకు మనస్సు తహ తహ, వాడికి ఆకలి తహతహ. భోజనానికి వెడతాడా, అంతే! సేపులిరాడు- (కొంచెం తిరుగుతూ) శీలమణి వివాహం అయిపోయిందని ఒకపుకారు విన్నాను. అదే నిజం అయితుంటే నా జీవితానికి దీపం ఆరిపోయింది అన్నమాటే! ఆమాట నిజమో అబద్ధమో వెంటనే [illegible] చెయ్యాలి. వేసుకైనా ఈ నౌఖరుకుంక రావాలిగా! (అని తూలుతూ) అబ్బ!...ఎప్పుడొస్తాడో, ఏ స్థితిలో వస్తాడో! (అని ఎడమ ఎదర ఎడమకి తిరిగి కూచుని, కళ్ళు మూసుకుని, తల వాల్చి, కణతలు పట్టుకుని ఉంటాడు) శీలమణి పెళ్ళి అయింది అన్నమాట అబద్ధం అయి ఉంటుంది. తన మనస్సు నామీద ఉన్నట్టు శీలం నాకు అనేకవిధాల ఋజువులిచ్చింది. వాళ్ళ నాన్న వాగ్దానం చేశాడు. ఇన్నేళ్ళించీ నిరాశ ఎందుకూ, యథార్థం తెలిసిం తరవాత ఎల్లానూ చెప్పనుగదా!

(కుడిఎదరనించి కుడిపక్కకే తిరిగి ఉండి, చేతులో ఉన్న బొమ్మకేసి చూస్తూ వెనక్కి నడుస్తూ, శానయ్య వస్తాడు)

శా—ఈ బొమ్మ మళ్ళీ నా చెయ్యి చిక్కింది గనక, మనం, సావకాశంగా, ఈ మొహం ఏ కుంకదో, నా అవమానానికి కారకుడైన ఏ ద్రాపిదో, పరిశీలించాలి. ఈ తుంటర్ని

నేను లోగడ ఎరిగున్నట్టు లేదు.

లీ—(లేచి, మెల్లిగా వెళ్ళి, బొమ్మకేసి చూసి వచ్చి) ఓయ్ బాబో! ఏమిటండీ! ఆ బొమ్మ నా పోలికనే ఉందే! శీలమణి దగ్గిర్నుంచి ఇది ఏడి కెళ్ళా వచ్చిందో!

శా—(లీలా రావుని గుర్తించకుండానే రంగం మధ్యనుంచి జరిగి, తల వంచి, తననే చూసుకుంటూ) ఓయ్యా, వెర్రి శాస్త్రయ్యా, నీ మర్యాద యావత్తూ భగ్గుం పాడు అయిందయ్యా! ...అయితే...(ఆ బొమ్మకేసి కోపంగా చూస్తూ ఉంటాడు)

లీ—(తనలో) నా ప్రేమకి ప్రతినిధిగా నా బొమ్మ ఒకటి పట్టుగెళ్ళి ప్రాణపదంగా శీలాని కిచ్చాను. ఇది అదే. అది వీడి చేతిలో చూసేసరికి నాకు వంటిమీద తేళ్ళూ జెర్రిలూ పాకుతూన్నట్టుంది...(అని ఎడమకి తిరిగి, చేతులుకట్టి తల వాలుస్తాడు).

శా—(తనలో) ఇక్కణ్ణించి అడ్డమైనవాడూ నన్ను వేలు మడిచి లెక్క పెట్టడం మొదలెడతాడు గావును! ఇది ఆగాయత్తు ప్రతీ ఒకంతా నామీద పద్యాలూ కీర్తనలూ కట్టి రాగా లెడతాడు గావును! ఇహ ఎవడు పడితే వాడు నా పేరు చెప్పుగుని కులుకుతాడు గావును! ఆడది నాకు పెట్టిన ఈ వాతమూలాన్ని నేను అపనిందలపాలు కావాలి గావునూ! (నిట్టూర్పుతో) రాతా! అంతానూ బొమ్మరాతా!

లీ—(తనలో) ఒకవేళ నేను పొరబడుతున్నానా?

శా—(పైకి తీవ్రంగా చూస్తూ) ఒసీ! దిక్కుమాలిన

విస్మృకీ ! (కృష్టించి, వయ్యారంగా) వసుధ్యులో వాణ్ణి, చూపసినే నేను ! ఎంత దగా చేశావు ! (కోపంగా) పాపిష్టీ ! (బొమ్మ చూపి పళ్లు కొరుకుతూ) ఒసే, కుర్ర ముచ్చా, ఒసేయి, పరమద్రోహీ...

లీ—(బొమ్మ మళ్ళీ చూసివచ్చి, తనలో) బొమ్మలో ఉన్నది నేనే. సందేహం లేదు. ఇప్పుడేదో జరుగుతుంది.

శా—(ఎవరో వెనక ఉన్నట్టు కనిపెట్టి, అటు తిరగకుండా) నా వెనకాల ఏడెవరు చెప్మా, ఏడి జిజ్ఞాస మహా ఎక్కువగా ఉందే ?

శ్రీ—ఔర ! ఆ చిత్రమే ! ఏమి చిత్రం ! (అది దగ్గిర కొచ్చి చూస్తాడు)

శా—(తనలో) ఏ డింత పరిశీలనగా చూస్తా డెందుకో !

లీ—(తనలో) ఏ ణ్ణడగాలి. (పైకి) అయ్యా ! దయచేసి...

శా—(కుడిఎదరకి నడుస్తాడు)

లీ—ఒక్కమాటండి.

శా—(వెనక్కి తిరక్కుండానే, తనలో) ఏముటో ఈ భవనాలో చెప్పే దెప్పుడు ?

లీ—ఆ బొమ్మ మీ కెల్లా చేజిక్కిందో కోప్పడకుండా చెబుతారా ?

శా—(తనలో) ఎందుకు చెప్మా వీడిల్లా అడుగుతాడూ?

ఏమిటీకథా! (అని ఎడమచేతి తిప్పి, బొమ్మ కేసీ, లీలారావు కేసీ ఒకటికి రెండుసార్లు చూసి, తనలో) ఓహోహోహో! ఆహా గ్రంథం! వీడి అమ్మగారా ఇప్పుడు బోధపడింది. వీడెందుకు తెల్లపోతున్నాడో తెల్లం అయింది. (లీలారావుని చూపెడుతూ) ఈ మనిషి! నా భార్య తాలూకు మనిషి, సన్మానం చేద్దాం.

లీ—అయ్యా! నామీద భారం వదలగొట్టి, తమ కిది ఎట్లా వచ్చిందో...

శా—ఏమండోయ్! శ్రీ తుంటరిగారు! తమరి బాధ నాకు తెలుసు. ఈ బొమ్మల్లో ఉన్నది తమరే. ఇది నా స్నేహితురాలి చేతుల్లో ఉంటుంది. నాకీ తమకీ జరిగిన చేతి ముద్దులు చప్పట్లు నా కెట్లా తెలుస్తాయి? నేను అక్కడ లేనుగా! నా పేరు దేవరవారి చెవిని పడింది అనేటంత గౌరవభాగ్యం నాకు కలగడం అనేదికూడా జరిగిందేమో నే నెరగను. నావంటి భర్తకి ఇష్టంలేని కుట్రలు పన్నటం, తమరు, అథమం ఈ క్షణం లగాయితు మానుకోవలసి ఉంటుందని మిమ్మల్ని నేను స్వయంగా హెచ్చరిస్తున్నాను. మీరు ఏమనుకొన్నారో గాని, అతి పవిత్ర బంధమై ఒప్పేటటువంటిది దాంపత్యధర్మం...

లీ—(తెల్లపోయి) దంపతులా? ఇది మీరు ఎవరి దగ్గిర పుచ్చుకున్నారో, ఆవిడ...

శా—ఆవిడ, నాకు కాసాగా పెళ్ళాం, "ఆవిడ

ముగుడు" అని నన్ను స్పష్టంగా చెప్తూంటారు కూడానూ!

లీ—మీ యిద్దరికీ, (దీనంగా) పెళ్ళి అయిందా ?

శా—(హేళనగా) వడ్డించినట్టే ఉంది. పెళ్ళి అయిం తరవాతేగా, ముగుడూ పెళ్ళామూ అనే మాటలూ!... (తల ఊపుతూ) అయిందన్నా..., పెళ్ళి..., అయింది... కాని, ఆ పెళ్ళి కేలాటు వేసినట్టే ఉందిలే! ఎందుకొచ్చిందయ్యా అల్లాంటి స్థితి అంటే, ఎరుగున్నవారు మీరే. తక్షణం వెళ్ళి వాళ్ళవాళ్ళతో ఈ శుభ వర్తమానం చెప్పేస్తాను. (అంటూ కుడిచెయ్యి ఆర్పించి గబగబా వెళ్ళిపోతాడు)

లీ—హా, దైవమా! శీలమణిపెళ్ళి అయిపోయిన సంగతి నిజం అన్నమాట! కాని, శీలమణి ఇంత అవకరపు... ఘటాన్ని పెళ్ళాడి ఉంటుందా అని సందేహం వేస్తోంది... ఔర!...ఏమో!—ఇంత శ్రమపడి నేను రావడమూనూ, వచ్చి రాకుండానే నాకింత దారుణవార్త చెవిని పడడమూనా? భరించలేను.

(అంటూ కళ్ళుమూసుకుని, తూలి, కూచోపడి వెనక్కి వాలిపోతూ చేతులమీద ఆనుకుంటాడు. కుడిమూలనించి చంద్రవంక వస్తుంది.)

చంద్ర—(లీలారావుని చూసి) అయ్యా! ఏమండీ అల్లా ఉన్నారూ ?

లీ—(పెదిమ విరిచి, కుడిచెయ్యి తేలేస్తాడు)

చంద్ర—సుస్తీగా ఉన్నారా ?

లీ—తెలియటంలేదండి. శోష వస్తోంది.

చంద్ర—పాపం! మా యింటికి రండి పోనీను.

లీ—క్షమించి, తీసికెళ్ళు, తల్లీ!

(చంద్ర వంక లీలా రావుని లేవనేసి, ఎడంచేత్తో కుడి జబ్బ పట్టుగుని, కుడిచేత్తో పిట్ట పట్టుగుని, ఎడమ మూలకి నిమ్మళంగా నడిపించి తీసికెళుతుంది.)

శా—(కుడి ఎడన్నుంచి వస్తూ) ఈ సంగతి మా సినిమాను గారితో అని చూశాను. తొందర వద్దు సిద్దానించ మంటాడు, ఆ ముసలాడు. వాడికేం తెలుసూ శాస్త్ర శ్రేష్ఠుడూ! అసలు ఆ బొమ్మ నీ పెళ్ళాం చేతికి ఎల్గా వచ్చిందో కనుక్కోమంటాడు. నీ పెళ్ళాం సత్తెకాలప్పిల్లా, బొమ్మలో ఉన్న అబ్బిని అసలు ఎరుగునో లేదో కనుక్కోమంటాడు! కనుక్కుంటే మాత్రం ఏమయినట్టూ! ఈవిడ వాణ్ణి ఎరుగున్నానంటుందీ, మన చాదస్తం గానీ! కోసినా ఒప్పుగోదు. అయినా సరే. ఆయన అన్నట్టే ఆయె. తరిచి చూస్తాను.

(అని ఎడమమూలకి జరిగి, లోపలికి చూసి, దెబ్బ తిన్న వాడికిమల్లే వెనక్కి అంగవేసి, కళ్ళు నిప్పి, నోరు తెరిచి, నిర్ఘాంతపోయి, కళ్ళు తుడుచుగుని మళ్ళీ చూసి)

—ఆఁ ఆఁ. ఓరి వీళ్ళని తగలెయ్యా! (కళ్ళు చికిలించి) ఇవి నా కళ్ళే! నేను చూస్తున్నానా! ఇది నా యిల్లే!— ఔర! వీడు వాడే! అడుగో, ఫలారం చేస్తున్నాడు,

మా ఆవిడ వర్ధిల్లోంది. అసలు వ్యక్తులు ప్రత్యక్షం అవుతూన్నప్పుడు బొమ్మ లెందుకు ఏడవడానికి!

(లోపల జరుగుతూన్న మాటలు వింటూన్నట్టు చెవి పెట్టి)

—ఇంకేం గావాలి! మా ఆవిడ ముసి ముసి నవ్వుతో "అయ్యో! అప్పుడే వెడతారా! మీకు మళ్ళీ నిస్త్రాణ వస్తుందేమో! మరో క్షణం ఆగండి పోనీనూ, వెనుదురు గాలీ!" అంటోంది. ఆ సరసుడుచచ్చినాడు నవ్వులు నముల్తూ, "అబ్బె బ్బే, త్వరగా వెళ్ళాలండి. మీ రెరగరు. ఇంత దయతో మీరు నాకు సాయం చేసినందుకు మీ ఋణం తీర్చుగో లేనండి." అంటున్నాడు. లేచాడు- వస్తారు గావును. ఇక్కడే దారికి అడ్డంగా నుంచుంటాను. (అని ఎడమ మధ్యకేసి నుంచుంటాడు.)

లీ—(పెట్టెతో ఎడమ మూలనించి రెండడుగులు వచ్చి వెనక్కి తిరిగి) సెలవండి. నమస్కారం. మీరు ఉండండి. (అని కుడిఎదరికి నడిచి, శాస్త్రుల్ని చూసి) వీణ్ణి చూసేసరికి నాకు అరికాలిమంట నెత్తికెక్కుతుంది. కాని వీడి మీద నాకు కోపం ఎందుకూ? నా జాతకం. వీడు అదృష్టవంతుడే, కాకపోతే శీలగుణి దక్కుతుందా? (శాస్త్ర్యుల్తో ప్రకాశంగా) అంత అందమైన భార్య మీకు దొరికింది, నీది ఏం పుణ్యమయ్యా మహానుభావా!

(అనేసి, కుడి ఎదర్నించి నిష్క్రమిస్తాడు. అప్పుడే ఎడమ

ఎదుర్నించి శీలం వచ్చి లీలారావు వెళ్లిపోడం ఆశ్చర్యంగా చూస్తుంటాడు. శానయ్య కుడివేపే తిరిగి ఉండి, లీలారావు వెళ్ళడంకేసి గమనిస్తూ క్రమేణా కుడివైపటికి జరుగుతాడు.)

శా—పోనీ, కాస్త నయమూ బెడుకూకుడా లేదే వీడికీ! (అని బొమ్మలుముడిచి నోరు తెరుస్తాడు) నాకు ఇది మహావింతగా ఉంది. ఎక్కడా ఉండదు ఇంత చిత్రం. (కుడివేపు చూసి) సరే. వెళ్ళు, వెళ్ళు. (బెదిరించి) నీకు తెలుసునో లేదో కాని, మర్యాదా మనిషికి ఇది ఎంతమాత్రం లక్షణం కాదు, నన్నడిగితే!... (చొక్కా చేతులు పైకి ఎగసం దోస్తాడు)

శీ—(తనలో) ఆవెళ్ళేది లీలారావే! మాయింటికి రాలేదేమో! అల్లా గుట్టుగా వచ్చి మట్టుగాపోతున్నా డెంచేతో! ఏదో ఉంది!

శా—(ఆ వేపే చూస్తూ, తనే ఉన్నాననుకుని) "అంత అందమైన భార్య నీకు దొరికింది, నీది ఏం పుణ్యమయ్యా, సుహానుభావా!" అంటావురా నాతోటీ! ఈ మాటల అర్థం నేను కనిపెట్టలేననేగావును వీడి ఊహ!... "జాలీ చట్టుబండలూ లేకుండా నీకంట్లో కారం చల్లగలిగిన తప్పుడు పెళ్లాంరా నీపెళ్లామూ, ఓరి వాజమ్మా!" అని ఆ మాటలకి అర్థం! ఈమాత్రంకూడా నాకు బోధపడదనే గావును ఈవాజమ్మ ఉద్దేశం!... అయ్యయ్యో! ఇంత నిష్ఠూర్యమూ వీడివల్ల పడి, వీడిచేత మాటలుకూడా పడి నాకేం అన్నట్లు వీడు నాదగ్గిర్నించి దర్జాగా నడుచుకుంటూ పోతూంటే, నిజంగా, అడాది అప్పయ్యలాగ చేతులు కట్టుగుని

శా—అమ్మా! నాపక్షం మాట్లాడేవారు ఇంతవరకు నాకు మీరొక కనపించారు. ఏమి దయండీ మీది? కడంవాళ్ళకి నామీద జాలే లేదూ! ఈవిషయం నేను చెప్పగానే కొందరు, పైపెచ్చు, లోపల నవ్వుకుంటూండడం!

శ్రీ—ఇంతకంటే మరి సిగ్గుంటుందా? ఇప్పుడు అతణ్ణి ఏంజేస్తే పాపం ఉందీ? ఇంత అధఃపతనం అయి, ఇంకా మనిషి నంటూ చెప్పాగుని బ్రతుకుతాడు గావును పశువు!...హా, దైవమా! ఇది నిజమా?

శా—నిజమా ఏమిటండీ, తెగనిజం అండీ! నాకళ్ళు సాక్షి!

శ్రీ—ఔర!! ఎంత క్రూరుడో, ఎంతటి మోసగాడో!

శా—ఆహా! ఈవిడ ఎంత మంచితనం గలప్రాణో!

శ్రీ—(లీలారావుని ఉద్దేశించి) సరేసరే, నీకు తగ్గ కొత్త నరకయాతనలు నీకు తయారవుతాయిలే!

శా—ఈవిడభాషకూడా ఎంత గొప్పదండీ?

శ్రీ—లేకపోతేను, మాయా మర్మం ఎరక్కుండా, మంచి తినంతప్ప మరోటి తెలియకుండా, అన్యాల చింత లేకుండా ఉండే ఈవ్యక్తి విషయంలో నువ్వు ఇంత హెచ్చుతగ్గుగా ప్రవర్తిస్తావా?

శా—(నిట్టూర్పు విడిచి) అవునమ్మా, తల్లీ! దణ్ణం, ఎంత నిజం మాట్లాడుతున్నావమ్మా నాహృదయంలోది?

శ్రీ—ఇంత ద్రోహం అనుభవించవలసిన హృదయమా, ఈహృదయం?

శా—కాదమ్మా కాదు. ఎందుకని వుంటుంది?

శ్రీ—కాదు, ఏమో!...ఏమో ఏమిటో యదార్థమే అయి ఉంటుంది...అబ్బ...ఆమాటలు తల్చుకుంటేనే నాకు బాధ దుర్భరం అయిపోతోంది.

శా—అమ్మా! నాకోసం మీరు మీజీవుణ్ణి అంత జోరుగా ఇబ్బంది పెట్టకండి, పాపం! నాకొచ్చిన ఇక్కట్లవల్ల మీహృదయం కలిగిపోయింది. మిమ్మల్ని చూస్తూనా, మీ మాటలు విన్నా నాగుండె ముక్కలై, పొడుంగుండా అయేటట్టుంది!

శ్రీ—(అటే చూస్తూ) నేను ఊరుకోను. ఎం జేస్తే గాని తీరు తుందో నాకు తెలుసు. నేను జంకను. ఎవ్వరూ నన్ను ఆపలేరు. (అని తొందరగా ఎడమ ఎగనించి బాహ్యస్థలి పోతుంది).

శా—ఇల్లాంటివాళ్ళు చాల్లా ఉండాలి. ఎంత సుందమైన మనసో నా నిమిత్తం ఎంత కసో! నాకు జరిగిన అవమానంగురించి ఆవిడ కొచ్చిన కోపం చూస్తే, నాకు ఎంత కోపం వచ్చి ఉండవలసిందో బోధపడుతోంది. ఇంతపని జరిగినతరవాత ఎవడో దద్దమ్మ గాని, ఎవ డూరుకుంటాడూ! (ముకుళాలు పెద్దవిచేసి) నేనూ వెళ్ళి తీరతాను, ఆలుచ్చాని సాధించి పట్టుకుంటాను. ఇంత ద్రోహం చేస్తారా నాకు? నా ఎదట! నాయింట్లో! నా కేమాత్రం ధైర్యం ఉందో చవిచూపిస్తాను. లేకపోతే, నా అనుజ్ఞా లేదు, పిడిపించాకుడూ లేదు, నాభార్యని సమీపిస్తాడా! (అని కుడివేపుకి కొట్టేటట్టు మూడునాలుగు అంగలు వేసి, ఆగిపోయి, వెనక్కి వచ్చి.

కోప తగ్గి) అయితే, ఒకటీ! కొంచెం శాంతంకుడా మంచిదే. వాడు బలాసీ, కోప్పిస్తీనూ. నానుదుట ఓముద్ర వేశాడు, వీపు మీదకూడా వేస్తే! కోప్పిష్టివాళ్ళంటేనే నాకు కోసం. వాళ్ళని నిస్తర్జిస్తాను. అసలు ఇంకోళ్ళని కొట్టడంకుడా నాకు అయిష్టం— మళ్ళీ కొడతారు వెధవలు! అయితే, అమర్యాద ఎల్లా భరించడం? నేను భరించనేభరించను. ఇల్లాంటివి చెబుతూండే మృగాలూ, వింటూండే జంతువులూ భరించి ఆ కళ్ళు అనుభవించుగుంటారు. నాకేం, పైగా, ఒకరి తప్పుకోసం మరోరు ఏడవడం ఎందుకూ; అదీ కాక, నేరం చేసినవాళ్ళు అల్లా ఉండగా, వాళ్ళతాలూకు భర్తలు తెలివితక్కువవాళ్ళు ఎల్లా అవుతారూ? అల్లా అనుకోడం ఎంత సంపర్కశూన్యం! ఇల్లాంటి అసందర్భాలు తొలగించని ప్రభుత్వం ఏం ప్రభుత్వం! కాని, వాళ్లు ఊరుకుంటే మాత్రం నే నూరుకుంటానా? కొంచెంకోపం ఎల్లానూ ఆవిర్భవించిందిగనక, నలుముఖాలా ఈసంగతి వెళ్లజల్లి, ఆ భటాచోర్ని పట్టుగుంటాను...ఇదిగో, నారక్తం వేడెక్కింది. నేను చాలా కోపంలో పడిపోతున్నాను. ఒరేయ్, కాసో...!వచ్చేశా, చచ్చేశావ్, తమూర్ !

(అంటూ వస్తాద్‌లాగ, ముక్కులు బిగించి, తల వెనక్కి పట్టి, రొమ్ము విరుచుగుని, ఎత్తెత్తి అడుగులు నిమ్మళంగా వేస్తూ, లీలారావు నిష్క్రమించిన ఎడమ ఎదరనించే పోతూండగా తెర).

## రంగం—3

[అనంతం ఇంట్లో వీధివేపు ఒకగది. శీలం ఎడమమధ్య ఒక కుర్చీమీద కూచుని చదువుకుంటూ ఉంటుంది. అప్పుడే చదవడం మాని, కుడివేపు పరకాయించి చూసి—]

శీ—చంచలం ! చంచలం !

చం—(కుడిమధ్యనించి వస్తూ) అమ్మా ! ఏందుకండీ ;

శీ—ఎక్కడికి వెళ్ళిపోతున్నావ్ ?

చం—మాయింటికి వెళ్ళొస్తానని నాన్నగారితో చెప్పాను, సరే అన్నారు.

శీ—అల్లానా ? ఏంలేదులే. ఈవేళ నే నేంచేశానో తెలుసా ?

చం—అయ్యగారికి ఉత్తరం రాశారుగావును !

శీ—అయ్యగారెవరూ ?

చం—అక్కడికి తమరెరగనట్టు ! అబ్బాయిగారండీ, లీలారావుగారికి.

శీ—ఛీ ! ఆమనిషి పేరు ఎత్తకు. మానాన్నతో చెప్పేశాను.

చం—ఏమనీ ?

శీ—"నాన్నా నాన్నా ! నాకు బుద్ధొచ్చింది. ఆలీలారావు నా కక్కర్లేదు. నువ్వూ మళ్ళీ చెప్పిన కొత్త రావుని పెళ్ళాడేస్తాను. నీమాట వింటాను" అని.

చం—ఏమిచిత్రం ఏమిచిత్రం ! నాన్న ఏమన్నారూ ?

శీ—"మామ్మో ! మా పిచ్చితల్లిగదే, మా పిచ్చితల్లీ !" అని నన్ను ముద్దెట్టుగుని, నాట్యం చేసిపోయారు.

చం—అబ్బో, నాట్యంకూడా వచ్చా, నాన్నగారికి !

శీ—అబ్బే ! సంతోషంకొద్దీనే, వెర్రిమొహాసూ !

చం—సరే గాని, అమ్మా ! తమరు చదువుకున్నవారుగదా, ప్రేమ ఇల్లా బదలాయి చేశారేం ఇట్టేనూ ! లీలారావుగార్ని చూడకపోతే తనువు నిలవదనేవారే !

శీ—అనేదాన్ని, నిజమే. కాని, లీలారావు వైఖరి చూసి, అభిప్రాయం ఇల్లా మార్చుగోవలిసొచ్చింది. అదంతా చాలా గ్రంథంలే !

చం—ఔర ! అతను తిన్నటివాడు కాడా !

శీ—ఔనో, కాడో విను. లీలారావు ఒక వయ్యారిభామ వల్లో పడిపోయూరు. నన్ను చూస్తాకి రాలేదు. రాలేను. రాను.

చం—(కుడి ఎడంకి తిరిగి) అదుగో. లీలారావుగారు ! నే నిప్పుడే వస్తా. (అని కుడివైపుకి పోతుంది)

(లీలారావు కుడిఎడంనుంచి ఉసూరుమంటూ వస్తాడు)

లీ—శీలమణీ !

శీ—(కుర్చీలోంచి లేచి నిలబడుతుంది).

లీ—ఇక నా దారిని నే పోతాను. రెండుమాటలు నీ మొహంఎదట అనేసి మరీ పోతాను.

శ్రీ—సెబాసు ! సెబాసాని ? అపస్మారపు పనిచేసి పైగా నాతో మాట్లాడ్డానికి రావడమా ? ఏం సాహసం !

లీ—నాది నిజంగా సాహసమే ! నన్ను తోసేసి నువ్వు అల్లాంటి వీరుణ్ణి ఎన్నుకున్నావ్. ఆయన మహానుభావుడు... నిజంగా, సీతలకి కిరీటంలా అమిరాడు...ఆయనతో సుఖంగా ఉండు. అంతే నే కోరేది.

శ్రీ—సరేనయ్యా, ద్రోహీ ! నా క్షోభ నాది. నీగోల నువ్వు చూసుగుందూ !

లీ—అంత ఆగ్రహానికి నావల్ల వచ్చిన తప్పేమిటీ ?

శ్రీ—మరే పాపం ! బాలకుమారుడివి. పరస్త్రీలతో స్నేహం చెయ్యడం తప్పని నీ కెల్లా తెలుస్తుందీ !

(యోధవేషం వేసుగుని కుడి మధ్యనించి శానయ్య వస్తాడు.)

శా—(కుడి ఎదరకి జరుగుతూ) యుద్ధం యుద్ధం, సంగ్రామం, ఒంటిచేతి ఘోరసమరం ! కాసుగోమనండి పౌరుషం ఉంటే. నాగౌరవం తస్కరించాడు, నాకీర్తి అటకాయించాడు, నాపేరు కళంకించాడు. ఇంతా చేసి వాడు కుర్రకుంక, పెంకిబుర్ర !

(పై మాటలకి లీలారావు ఎడమ ఎదటికి జరుగుతాడు.)

శ్రీ—(లీలారావుతో) ఆడదాంతో మాట్లాడ్డం కాదు. అల్లా తిరుగు, అల్లా చూడు !

లీ—అల్లానే ! ఆయన ఎవరిమీదికో పోతున్నాడు, నాకేం భయం (ఎడమకి తిరిగిఉంటాడు)

శా——(కుడివేపు తిరిగి) నాకోపం చెలరేగింది. నేను ఏదో చేసేస్తాను. నేనిప్పుడు మనిషిని కాను, మృగరాజుని! చీరేస్తాను. వాడు కంటపడితే రక్త వరదలే! వాణ్ణి బలేస్తానని ఒట్టేట్టుగున్నాను. ఢిల్లపెట్టి ఒట్టు తీసెయ్యొచ్చు గాని, తీసెయ్యను... వాడెక్కడ కనబడితే అక్కడ కండలు చెండి ఎముకలు రవాణా చేస్తాను... (కత్తి సగం లాగి, వెనక్కి తిరిగి ఎడమ వేపుచూస్తూ నుంచున్న లీలారావు కేసి నడిచి) మాంచిపోటు ఒక్కటిచ్చుగున్నానంటే, గుండెల్లోంచి వెళ్ళిపోవాలి. (అని కత్తి దాచి మళ్ళీ కుడి ఎదరకి నడుస్తాడు.)

లీ——(శానయ్య కేసి జరిగి) అయ్యా! ఇక్కడ ఎవరేనా మీకు అపచారం చేశారా ?

శా——(తగ్గిపోయి, వెనక్కి తిరిగి) లేదు లేదు. ఎవ్వడూ ఏమీ చెయ్యలేదు.

లీ——ఈ ఆయుధాలూ వేషమూ ఎవరికోసం మరీ ?

శా——ఈవేషమా! అవతల చలిగానూ, వర్షంగానూ ఉండడంవల్ల కొంచెం జాగర్తమీద వచ్చాను. (కుడిపక్కకి తిరిగి, తనలో) నేనిప్పుడు వీణ్ని చంపేస్తే ఎంత పసందుగా ఉంటుందీ. నాశరీరంలో లీనమై ఉన్న ధైర్యమూ, పైకి రావే, నిన్ను తగలెయ్యా!

లీ——(శానయ్యతో) ఏం ? ఏమిటయ్యా సందేహిస్తున్నావూ?

శా——(వెనక్కి తిరిగి) అబ్బెబ్బే, ఏముందీ, నేనేమీ అనందే! (అని మళ్ళీ కుడివేపు తిరిగి) నాకు బాఘా కోపం

రాదేం ఈపాటికీ! లెంపలు వాయించుగుంటే వస్తుం దేమో చూస్తాను. (అని తన చెంపలమీద కొట్టుగుంటూ) హాంయ్, హాంయ్, ఓరి, ఎంత పిరికిపీనుగునిరా నేనూ! నాకు సిగ్గులేదే ఇంత చవటలాగ ఊరుకోడానికీ!

శ్రీ—(లీలా రావుతో) ఈ ఘటాన్ని చూస్తే నీకు కోపం గావును!

లీ—వారంటే నీ కెంత ప్రేమో మరి!

శ్రీ—తన తప్పు తనకి తెలియడం ఎంత కష్టం!

లీ—చాలా కష్టం

శా—(కుడివేపే తిరిగిఉండి తనకే నీ చూసుగుంటూ) ఏమీ కష్టంలేదు, నిమిషం! ఓరేయి శానయ్యా! ఆ అమ్మాయి నీకోసం దెబ్బలాడుతోందిరా! (పళ్లుకొరికి) కాస్త చొరవ చూపెట్రా, నీదుంపతెగా! (చిరునవ్వుతో తనను తను లాలించుగుంటూ) నువ్వు అసాధ్యుడవురా నీ ప్రజ్ఞ నువ్వెరగవ్. గ్రంథంలో దిగిచూడూ. దేవదానవులుకూడా నీముందు నక్కల్లాగ పరిగెడతారో లేదో! (తీవ్రంగా) నువ్వు ఒక్క సాహసం చెయ్యాల్రా! (ఈడుస్తూ) సమయం కాట పెట్టుగుని తరవాత ఏడవకురా దిక్కుమాలాండా, నువ్వెక్కడ దొరికావురా, నాకూ!

లీ—(శానయ్యవేపు నడిచి) అయ్యా! మీరు దెబ్బలాటకి వచ్చినట్టుంది, దెబ్బలాట ఎవరితో?

శా—ప్రస్తుతం నాతోనే! ముందుముందు అవసరాన్ని బట్టి నీలాంటివాళ్ళతో!

లీ—దెబ్బలాట ఎందుకనీ!

శా—ఎందుకనా! (హేళనగా) పరభార్యలతో మాట్లాడుతూన్నందుకు!

లీ—నీవద కేంగా!

శా—అది నాకు నుంచీ బాధ కాదుటయ్యా! గ్రహింపు లేదేం?

లీ—అదా. శీలసుణీ! ఆయన అనవసరంగా అనుమానిస్తున్నారు. వద్దని చెప్పు.

శీ—ఆయనతోనే మాట్లాడుదూ, ఆయనే చెబుతాడు తగ్గట్టూ!

శా—కాదుకాదు. నే కాను, నువ్వే చెప్పు.

(కుడిమూలనించి చంద్రవంక చక్కావస్తుంది.)

చంద్ర—(వచ్చి, ఈర్ష్యతో) ఓలుమ్మాయి, సిగ్గు లేదూ! ఆగాగు! నా మొగాడికోసం నువ్వు ఆశపడడం ఎంత ద్రోహం?

శీ—(లీలారావుతో) చూశావా, నీవ్యాపారం ఎల్లా వీధినిపడిందో!

శా—(చంద్రవంకతో) నిన్ను బొట్టెట్టి పిల్చిన నారెవ రోయ్, పాకేజీపెట్టిలాగ వచ్చిపడ్డావ్! దయచెయ్! ఆవిడ కాస్త నాపక్షం ఆడుతోందని తిట్టొచ్చావూ, ఇంతోటి

సరసుడూ జారిపోతాడేమో అనీ!

శీ—(చంద్రవంకతో) బెంగ పెట్టుకోకమ్మా, భయపడకు. నీ మొగాడు నాకు వద్దు. శత్రువుకికూడా అటువంటి ఆపద వద్దు.

లీ—(ఈగొడవ తనకి బోధపడలేనట్టు పాత్రలకేసి చికాకుగా చూసి, తరవాత, శానయ్యతో) ఏమండీ, ఆయిల్లాలు రాగానే, మీరు ఆవిడ్ని అల్లా అదరకాయించి తిట్టారేం?

శా—నాకు అభ్యాసం మరి!

(చంచలం కుడివైపునించి వచ్చి శీలంకేసి నడుస్తుంది.)

శీ—రా, రా! నువ్వే లోటు!

చంచ—ఏం ఏం? ఏం జరిగింది, చెప్పండి.

శీ—నే నెందుకు చెప్పడం! గ్రంథం అంతా జరిపించినవాడు ఈయన! (అని లీలారావుని చూపించి) పైగా నన్ను తెగ సాధిస్తున్నాడు!

చంచ—(రంగమధ్యకి వెళ్ళి నిలబడి, శీలం లీలారావుల్ని ఎడంపక్కా, శానయ్య చంద్రవంకల్ని కుడిపక్కా నుంచోమని) బాబూ! అమ్మా! దణ్ణం. అంతా ఉండండి. ఒక్కమాట అడుగుతాను. (లీలారావుతో) మీరు మా అమ్మాయిగారిని ఎందుకండీ సాధించటం?

లీ—ఎందుకా! ఈవిడ నన్ను పెళ్ళాడతానని నమ్మించింది. కాని, ఈవిడకి పెళ్ళి అయిపోయిందని నాకు కొన్నిరోజులక్రితమే

మావూళ్ళో గాలికబురుగా తెలిసింది. నా ప్రేమలో నేను ఆమాట విశ్వసించలేక, ఒక్కపరుగున ఈవూరొచ్చేశాను. రాగానే, పెళ్ళి అయినమాట రూఢే అని తెలిసింది.

చంచ—ఎవరికిచ్చి పెళ్లిచేశారని తెలిసిందీ?

లీ—(శానయ్యని చూపెట్టి) ఆయనకిట!

చంచ—(శానయ్యని పరికిస్తూ) ఈయనకా?

లీ—అవును.

చంచ—ఎవరు నీ కది చెప్పిందీ?

లీ—ఈయనే ఇందాకా చెప్పారు.

చంచ—(శానయ్యతో) ఏమయ్యా, నిజమే?

శా—అబ్బే! నే అల్లా అన్లేదు. నాపెళ్ళాన్ని నాకిచ్చి పెళ్ళిచేశారన్నాను.

లీ—మరి నా ఛాయాచిత్రం కేసి చూస్తూ ఇందాకా చాలా హడావిడిగా ఉన్నావు కాదటయ్యా?

శా—ఇప్పుడుమాత్రం? హడావిడి తగ్గిందేటయ్యా! ఇదుగో బొమ్మ.

లీ—మరి అది ఎక్కడిదయ్యా అని నేను నిన్నడిగితే, నీస్వంతపెళ్ళాం చేతులోంచి లాక్కున్నా నన్నావ్!

శా—అవునూ. (చంద్రవంకని చూపించి) ఆవిడ చేతులోంచి లాక్కున్నాను. అప్పుడే నాకు బోధపడతా, ఆవిడ స్వభావమూ, నీ అభావమూనా!

చంద్ర—సరే తెలిసింది. నువ్వింక అనుమానంతో కుళ్ళి కయ్యా! అది అక్కడ పడిఉంటే, నేను ఏమిటో అని తీశాను, చూశాను. ఈయన, వీధులో శోషవచ్చి పడిపోతూంటే నేను ఈయన్ని ఇంట్లోకి తీసిగెళ్ళినప్పుడుకూడా, ఆబొమ్మలో చిత్రింప బడ్డది ఈయనే అని నాకు తెలియదు.

శ్రీ—అల్లాయితే, పొరపాటు నాది. ఇందాకా ఆబొమ్మకేసి చూసుగుంటూ విచారంతో కుంగి పోయాను. (శానయ్యని చూపెట్టి) వీరప్పుడు సాయం అయారట. బొమ్మ నాచేతు లోంచి జారిపడి, అక్కడే ఉండిపోయింది.

చంచ—అమ్మయ్య! ఇదా!

లీ—బతికాంరా, దేవుడా!

శా—అసలు ఈపాటి రెండుమూడు కూనీలు చాలా భాగం పూర్తయిపోయేవి. ఏడవడానికి జనం మిగలని జాలేసి ఊరుకున్నాను.

శ్రీ—(చంచలంతో) చంచలం! ఈచిక్కువదిలి పోయింది, సరే. కాని, నేను అనవసరకోపంతో మరోచిక్కులో పడిపోయి ఉన్నాను. "లీలారావు నాకు వద్దుగాక వద్దు" అని మా నాన్నతో చెప్పేసేశాను. ఎల్లా ఇప్పుడూ! (కుడి మధ్యకి చూసి) అడుగో మానాన్న!

అ—(కుడిమధ్యనించి వస్తూ) ఇదిగో, లీలా రావా ఏమిటి?

లీ—మరే.

అ—ఏం? ఏదేనా వ్యవహారప్పనిమీద వచ్చావా ఏమిటి ఈ ఊరు?

లీ—మీతోనే పని!

అ—ఏమిటది?

లీ—తమ మాటప్రకారం తమ శీలమణిని నాకు ఇవ్వాలి.

అ—ఏమో! వీలూ కనిపించదు, ఇష్టమూ లేదు.

లీ—మాట ఇచ్చారుకదండీ!

అ—ఇచ్చాను. అంతా నిలబెట్టుకోగలుగుతారా, వెర్రిగాని! నాధర్మం నాది, మా అమ్మాయి ధర్మం మా అమ్మాయిది.

శీ—నాధర్మం, మనం ఇచ్చినమాట నిలబెట్టాలని చెప్ప డమే నాన్నా.

అ—ఏమిటమ్మా, ఇంకా నాలుకలా? ఇతడు అఖ్ఖర్లేదనే శావు. నామాట వింటా నన్నావ్. కొత్తది రైటుచేశాను. వియ్యంకుడు బంగారం తులతూగినవాడు. నిమిట్లమీద పెళ్ళి ఏర్పాట్లు చేశాడు. (కుడిఎదర చూసి) అరుగో, వియ్యంకులు గారే వచ్చేశారు! రండిరండి, గరుడవాహనం బావగారు!

(కుడి ఎదరనుంచి గరుడవాహనం వస్తాడు.)

శా—(కొత్తాయనతో) మీ పేరేమిటండీ, గరుడ వాహనమా?

అ—అబ్బ, ఉండండీ!

శా—ఉంటాన్లెండి. మరి నడిచొచ్చావేం?

అ—ఊరుకుండురూ! ఏమిటి బావగారూ, సంగతీ?

గ—ఏమీ లేదు. మీరు క్షమిస్తే చెబుతాను. ఒక్క తిరకాసొచ్చింది. మాట తిరిగిపోవలిసొచ్చిందిగదా అని గుజగుజ లాడుతూవచ్చాను.

—భయం లేదు, చెప్పండి.

శా—మేం చాలామందిమున్నాం, త్వరగా చెప్పండి.

గ—నేనూ పెళ్ళి పురమాయింపులు చాలా భాగం చేసేశాను. ఇంతలో ఏమని పొక్కిందీ—మావాడూ,...

శా—ఎంతపని జరిగింది, పాపం!

గ—(శానయ్యని చూపించి) ఈయన నెవరండీ?

అ—తెలుసుగుని చెబుతా క్షమిస్తే! మీరు కానీండి!

గ—మావాడూ, నాలుగు నెలలపూర్వమే, కొంచెం ఆట్టే పబ్లీకు చెయ్యకుండా, సశాస్త్రీయంగానే ఒక యువతిని పెళ్ళి ఆడేశాడట! ఆపిల్ల తల్లిదండ్రులూ వాళ్ళూకూడా సన్నా కొంచెం పచ్చిగల వాళ్ళే! అందుకని ఆసంబంధం కాదన్లేక పోయాను.

అ—మరి ఆగండి. సంతోషం. అది మీ కథ. మాకథ వినండి. నేను మొదట నాకుమార్తెని లీలారావుకి—(చూపెట్టి) ఇతడికి వాగ్దానం చేశాను. అతడూ సకాలంలోనే వచ్చేశాడు. ఇతని సుగుణాలు చాలామంది ఇతరులదగ్గిర లేవు లెండి మరి! మీసంబంధం మాకు వద్దని మీకు తెల్లాగా కబురుచెయ్యడమూ

అని చూస్తూంటే మీరే వచ్చారు.

శా—పడిచి!

గ—రక్షించావు. నీకూ నీ పెద్దలకీ దణ్ణం.

అ—సరే, మరి సెలవు. ఇక సుముహూర్తం పెట్టించుదాం. నే వెళ్ళి ఇప్పుడే వస్తాను.

(గరుడవాహనం కుడిమధ్యమంగా పోతాడు. చంద్రవంక కుడిమూలకి పోతుంది. శీలం, లీలారావు, చంచలం ఎడమ మధ్యనించి పోతారు. అనంతం కుడి ఎగర్నించి పోతాడు).

శా—(కుడివేపర నిలబడి) మా జోడీ, వాళ్ళ జోడీ కలిసి ఎంత ఖంగారు బయల్దేరదీశాయీ!...అబ్బో!...నా అంత వాణ్ణి, నేనూ ఖంగారే...కాని, మాలో ఎవ్వరూ కూడా నా అంత ధైర్యంగా ఖంగారు పడలేకపోయారు...ఇక లీలారావు పెళ్ళి! వాడు నే చంపలేదు గనక బతికాడు. కత్తి చేతులో ఉన్న వాణ్ణి నేను, వాణ్ణి చీరెయ్యలేనూ? అయితేం, మనది దయారసం! అయినా సరే వాడు వెళ్లేటప్పుడు దణ్ణమేనా పెట్టలేదు. అల్లా ఉంటుంది కృతజ్ఞత! పోనిస్తూ, బతకనీ! మన సొమ్ము ఎంత మంది తిన్నారు కారూ! తిననీ!

(అంటూ నిర్లక్ష్యంగా చేతులు దులుపుకుంటూ, కుడి ఎదర్నించి నిష్క్రమిస్తాడు.)

(తెర)

---